లన్ = బాగుగా, పొగడుటన్, ఇరువురకున్, ఎదలన్ = మనస్సులలోపలి, మనోభవవికారవిభ్రమము = మన్మథవికారచేష్ట, వెలసెన్ = కలిగెను.

10. ఒక్కనాఁడు, నలుఁడు, దమయంతీగుణబద్ధచేతస్కుఁడై = దమయంతియొక్క సుగుణములనెడి త్రాళ్ళచేతఁ గట్టఁబడిన మనస్సుగలవాఁడై, మదన అనలంబు = మన్మథతాపంబును, సహింపన్, ఓపక = ఓర్వఁజాలక, ప్రమదావనంబునన్ = ఉద్యానవనమునందు, ఉండునంతన్ = ఉండఁగా, అంతరిక్షశ్రీకాంతాహారావళియున్ పోలెన్ = ఆకాశలక్ష్మియనెడు స్త్రీయొక్కముత్యాలదండలవరుసయో అనునట్లు, హంసఆవళి = హంసలగుంపు, అవనీతలంబునకున్ = పుడమికి, అవతరించినన్ = దిగఁగా.

11. వీరుఁడు = మొనగాఁడయిన, వీరసేనసుతుఁడు = వీరసేనమహారాజుకొమరుఁడగు నలమహారాజు, హంసలనడబెడంగున్=రాజహంసలయొక్క నడకసొంపును, చూచి, నగుచున్ = ఆశ్చర్యపడుచు, వానిన్, ఎగిచిఎగిచి= తటిమితటిమి, అందున్ = ఆరాయంచలలో, (ఒకహంస) ఎగయక ఉండఁగన్ = ఎగిరిపోకయుండఁగా, అతిరయమునన్ = కడువడితో, ఒక్కహంసన్ = ఆరాజహంసను, పట్టుకొనియె.

12. దానిన్ = ఆహంసను, విడిచిపోవఁగాన్ ఓపక = ఇష్టపడక అఱచుచున్, అంతరిక్షమునన్, హంసలు ఎల్లన్ = రాజహంసలన్నియు శారద...ముఁబోలెన్ _ శారద = శరత్కాలమందుఁబుట్టిన, అభ్ర = మేఘముల, శకల = తునుకలయొక్క, చయముఁనబోలెన్=రాశివలె, పిండుకట్టి= గుంపుగూడి, తిరుగుచుండెను.

13. అదియున్ = ఆపట్టుపడినహంసయు, తనను,అమ్మనుజేశ్వరుండు= అనృపాలుఁడు, అపాయంబు=కీడు, చేయును అకా = చేయునుకదా అని, తలఁచి, వెఱచి=భయపడి, మనుష్యవాక్యములన్ = మానవభాషతో, ఇట్లు, అనియెన్, అయ్యా, ఏను, నీకున్, ప్రియంబు = ఇష్టమును, చేసెదను, నీ హృదయఈశ్వరి = నీప్రాణవల్లభ, ఐనదమయంతిపాలికిన్ = ఐనదమయంతియొద్దకు, పోయి; నీగుణంబులు, దానికిన్, శ్లాఘించి, చెప్పి, ఆకన్య = ఆ

పదము, అన్యులన్, అపేక్షింపక, నీయందున్ అ=నీయందే, బద్ధఅనురాగ=ఉంచఁబడినప్రేమగలది (ప్రేమయుంచునదియనుట), అగునట్లు, చేసెదన్.

14. అనినన్, విని, హంసవచనము, తనహృదయంబునకున్ = తనమనస్సునకు, అమృతధారాపాతంబునుం బోలెన్ = అమృతధార కాఱినట్లు, ఐనన్ = కాఁగా, నృపనందనుఁడు, అనురక్తుఁడు ఐ = ప్రేమగలవాఁడై దానిని, తడయక = ఆలశ్యముచేయక, విడిచెను.

15. హంసపింఛముతోన్=హంసలగుంపుతో, అదియును, విదర్భాపురికిన్, పఱచి = ఎగిరిపోయి, అందు, ఉపవనంబునన్=తోఁటలో, సఖీజనపరివృతఐ = చెలికత్తియలతోఁగూడినదయి, ఉన్నదమయంతిపాలికిన్, పోయి, విహరించుచుండెన్, అంతన్ = తర్వాత, అహంసలన్, చూచి, పరమకౌతుకంబునన్ = ఎక్కువ సంతోషముతో, పైపద్యముతో నన్వయము.

16. ఒండొరులన్ = ఒకరినొక్కరు, వడవన్ కన్=దాఁటునట్లు, అ ఉవిదలుఎలన్=ఆస్త్రీలందఱు, పఱచి, ఒక్కొక్కకలహంసన్,పట్టుకొనినన్ అందున్=ఆహంసలలోపల,నలుచేతన్, విసువంగఁబడినహంస, చెలువముగన్=తిన్నగా, దమయంతిచేతన్=దమయంతిచేతిలో, పట్టువడియెన్=చిక్కెను.

17. దమయంతికిన్, నలునకున్, సంగమకారణదూత=చేరికకు హేతువయినట్టిదూత, అయినకలహంస, మనోజ్ఞమనుష్యవాక్యములన్ = ఇంపయిన మానవుల పలుకులతో, ఆదమయంతికిన్, హర్షము = సంతోషము, ఎసఁగన్ = హెచ్చునట్లు, తాన్=ఆహంస, ఇట్లు అనియెన్.

18. నీహృదయ ఈశ్వరుండు=నీమనోనాయకుఁడు, ఐననలునొద్దనుండి వచ్చితిని. అపార...మందున్ - అపార = అంతములేని, పారావారపర్యంత = సముద్రములవఱకునుండు, మహీతలంబునన్= భూమియందు, నా చూడని రాజులు = నేనుచూడనినృపాలురు, లేరు. సర్వగుణసౌందర్యంబులందున్ = అన్నిసుగుణములందును, అందమునందును, ఎవ్వరు, నలున్, పోలరు = నలునితో సాటిగారు.

19. నీవు, నలునకున్, పేర్మితోన్ = మక్కువతో, దేవివి=పట్టపురాణివి, ఐనన్ కాక = అయిననే కాని, నీ...నళులు - అవి, నీ=నీయొక్క, సముజ్జ్వల=వెలుఁగునట్టి, రూప=ఆకారము, కాంతి=అందము, విభవ=కలిమి నిత్య=ఎడతెగని, సౌభాగ్యభాగ్య=అదృష్టము, అభిజాత్య = గొప్పవంశమునందుఁబుట్టుక, భద్రలక్షణ=శుభలక్షణములు అను వీనియొక్క, ఆవళులు = సమూహములు, సఫలంబులు = సార్థకములు, అగునె ? (కావు అనుట.)

20. నీవు, నారీరత్నంబవు=స్త్రీలలోనుత్తమురాలవు, అతండు, పురుషశ్రేష్ఠుఁడు, మీయిద్దఱిసమాగమంబు = మీయిద్దఱికూడిక, అన్యోన్య శోభాకరంబు=ఒండొరులకుఁ గాంతిని గలిగించునది, అగును, అనినన్, విని, సంతృప్తహృదయయై = మనస్సునందు సంతోషమందినదయి, దమయంతి, దానికిన్, ఇట్లు, అనియె.

21. ఆరాజుగుణములు, నాకున్, ఎఱింగించినట్టుల = తెల్పినట్లే, నన్నున్ (నాగుణములను), ఆరాజునకున్, ఎఱిఁగించి, ఆరంగన్ = నిజముగా, కరుణ=దయ; నాయందున్, కావింపుము. అనవుడున్, నిషధదేశమునకున్, అరిగి, హంస, వీరసేనజునకున్=నలునకు, దానిగుణరూపవిభవముల్ = ఆస్త్రీయొక్క మంచిగుణములు చక్కనిరూపము వీనియొక్క యతిశయత్వమును చెప్పెను.

22. అంతన్ (అట్లు చెప్పినతర్వాత).

23. నలదమయంతులు, ఇద్దఱు, మనఃప్రభవ అనలబాధ్యమానులై = మన్మథసంతాపమనెడి వేఁడిమిచేత మాడినవారలై, విలసత్ నవనందనంబులన్= అందములైయుండు క్రొత్తయుద్యానవనంబులయందును, నళినదళంబులన్ = తామరతూండ్లచేతను, ఘనసారపాంసులన్=కర్పూరపుధూళులచేతను, చందనచారుచర్చలన్ = మనోహరమైన గంధపుఁబూఁతలచేతను, దీర్ఘవాసరనిశల్=నిడివియైన రేలం బగళ్ళను, సల్పిరి = చేసిరి. (తామరపువ్వులు గంధపుఁబూఁతలు మొదలగునవి తాపము నణఁచునవి గనుక నీయుపచారములచే రేలుంబగళ్లొక్కరి నొక్కరు స్మరించుచునే యుండిరి యని భావము.)

24. ఇట్లు, ఇద్దఱు అన్యోన్యరూపగుణశ్రవణసంజాతప్రీతులై = ఒండొరులగుణముల యాలకింపులచేఁ బుట్టిన యనురాగము గలవారయి, ఉండునంతఁ = ఉన్నప్పుడు, అంతః...వదన = అంతఃకరణ = మనస్సునందు, సంతత = చక్కఁగా వ్యాపించియుండు, మనోజాత = మన్మథవికారమువల్ల నగలిగిన, సంతాప = వేఁడిమిచేత, వివర్ణ = కాంతిలేని, వదన = మోముగలది అయిన, ఆదమయంతిఁ, చూచి, భయ...దయలు, భయ = వెఱపుచేతను, సంభ్రమ = తత్తఱపాటుచేతను, ఆక్రాంత = చుట్టుకొనఁబడిన, హృదయలు = మనస్సులుగలవారు, అగుచుఁ, సఖీజనంబులు, ఎల్లఁ = చెలికత్తెలందఱు, ఆకోమలివృత్తాంతంబు, అంతయుఁ, భీమునకుఁ = దమయంతితండ్రికి, ఎఱిం గించి, ఇట్లు, అనిరి.

25. ధరఅధినాథ = ఓపుడమిఱేఁడా, లతాంగి = తీఁగవంటిమేను గలదియగు, కలహంస, పలికినపలుకులు, గణియించుఁ = ఎంచును, వడిఁ = వేగముగా, దానిపోయినవలను = ఆహంసఏగిన తట్టునకే, చూచుఁ, సఖులతోఁ = చెలికత్తెలతో, పలుకదు, తాను, అనుదినంబు = ప్రతిదినమును, చారువిభూషణఆహారశయ్యాఆసనభోగంబులందుఁ = సొగసైనసొమ్ములు దాల్చుట, మంచిభోజనముచేయుట, వేడుకమున ఆటలాడుట, మెత్తనిపాన్పులందుఁబరుండుట యను సౌఖ్యములనుభవించుటయందు, విముఖియై = ఆసలేనిదై, రేయిపగలుఁ, నిద్రయుఁ, ఎప్పుడును, ఎఱుఁగక, దమయంతి, నలుడు, అను, ధరణినాథుఁ ఆ రాజునందే, బుద్ధి, నిల్పి, కందర్పబాధిత = మరునివేదనచే నొచ్చినది, అగుచుఁ, ఉన్నయది, ఉరుగుణ ఆఢ్యులఁ = గొప్పసుగుణములచే నిండినవారగు, ఒరులఁ = ఇతరులైన. ధరణిపతులఁ = రాజులను, (వారు) ఎంత విభవయుక్తులు ఐనఁ = ఎంతసంపదగలవారైనను, నినఁ, ఒల్లరు = ఇష్టపడదు.

26. అనినఁ, విని. భీముండు, ఏమి, చేయుదును. ఎవ్విధంబునఁ = ఏరీతిగా, అమ్మహీపతిఁ = ఆనలమహారాజును, ఇటకుఁ, రావింపఁ అగునో =

రప్పింపవచ్చునో (ఓ సందేహార్థకము), అని, చింతించుచుఁ = వగచుచు, సంప్రాప్తయౌవన = వయస్సువచ్చినది, ఐన, కూఁతుఁ=దమయంతిని,చూచి, అప్పుడు.

27. ఆవైదర్భుఁడు=ఆవిదర్భదేశపురాజు, నిఖిలధరావలయములోనఁ =సకలభూమండలమునందు, కలుగు=ఉన్న, రాజన్యులఁ=రాజులను,నానా విషయఅధీశులఁ = అన్నిదేశములరాజులను, తత్స్వయంవరవ్యాజమునఁ = ఆదమయంతియొక్క స్వయంవరమనెడి నెపముచేత, రావించెను=పిలిపించెను.

28. మనుజఈశ్వరులు ఎల్లఁ = రాజులందఱును, సైన్యస్యందనఘట్టనఁ=సేనలయొక్కయు, రథములయు త్రొక్కుడుచేత, అవనితలము=భూమి, తల్లడపడఁ=అదరునట్లు, బోరనఁ=వేగముగా, దమయంతీ స్వయంవరమునకుఁ, ఒప్పఁ=బాగుగా, చనుదెంచిరి=వచ్చిరి.

29. తత్సమయంబునఁ=రాజులు దమయంతీ స్వయంవరమునకువచ్చునపుడు, పర్వతనారదులు = పర్వతుఁడు నారదుఁడు అను, పురాణమునులు=పూర్వులగుమహర్షులు, భూలోకంబు ఎల్లఁ, క్రుమ్మరి=తిరిగి, ఇంద్రలోకంబునకుఁ, పోయినఁ=పోఁగా, ఇంద్రుడు, వారిఁ, పూజించి భూలోకంబునఁ, కుశలవార్త=క్షేమసమాచారము, ఇది, ఎట్లు = దీనికేమికారణము? ధర్మపరిపాలనపరులై=క్షత్రియధర్మమును గాపాడఁగోరికగలవారై, వీరులు ఐ=శూరులై, రణనిహతులు ఐన=పోరసల్పిగ, రాజులు, అక్షయలోకసుఖంబులు=శాశ్వతములైన స్వర్గాదిలోకంబులం దనుభవింపఁదగిన సౌఖ్యములను అనుభవింపఁ, అతిథులై=విందులుగావచ్చినవారై, ఇందులకుఁ=ఇచ్చటికి ఎంతకాలంబు, అయ్యెను. రాఁ కారణంబు, ఏమి, అనినఁ, అయ్యింద్రునకుఁ, నారదుండు, ఇట్లనియె.

30. నర...కన్యకలకంటెఁ=మనుష్యులు, సిద్ధులు, సాధ్యులు, విద్యాధరులు, వేల్పులు మొదలగువారి కన్యకలకంటె, దమయంతి అ, సుందరి = అందకత్తె, ఇప్డు, మహిఁ=భూమియందు, దానిసుస్వయంవరము = ఆ దమ

యంతియొక్క చక్కని స్వయంవరము, అరుదై = వింతయై, వర్ధిల్లుచున్న యది = నడచుచున్నది.

31. అందులకుఁ = ఆస్వయంవరమునకై, ధరణిఁ = భూమియందు, కలన్న పనందనులు ఎల్లను = ఉన్నట్టి జప్పుతులందఱును, ముదంబునఁ = సంతోషముతో, పోయెడుపేడ్కఁ = పోవునట్టియుత్సాహముతో, తమ లోఁ = వారిలో, కడునెయ్యమునఁ = ఎక్కువ చెలిమిచేత, కయ్యమ్ములు = యుద్ధములు, క్రందుగఁ = తఱచుగా, లేకున్నవారు = చేయకుండువారు.

32. అనినఁ, విని, ఇంద్రుడును, లోకపాలవరులును = లోకపాలకులలో శ్రేష్ఠులగు యమ వరుణ కుబేరులును, తత్ ఆలోకనకౌతుకంబునఁ = ఆదమయంతియొక్క (సి) చూచుటయందలి యపేక్షతో; కనక...ధులై- కనక = బంగారుతోఁజేయబడి; రత్న = రత్నములచేఁ బొదుగఁబడినవై; రమ్య = అందములైన; విమాన = ఆకాశయానములును; ఆరూఢులు ఐ = ఎక్కినవారలయి, భూలోకంబునకుఁ, వచ్చి; దమయంతీస్వయంవరమునకుఁ; పోయెడు వానిఁ = పోవువానిని; ఆదిత్యులతోనఁ = పన్నిద్దఱు (12) సూర్యులలోపల; విష్ణుండునుంబోలెఁ = విష్ణువనువానివలె; తేజస్ అధికుండయినవానిని = ఎక్కువగాఁ బ్రకాశించువానిని; అనన్య...విభవంబునఁ- అనన్యసాధారణ = ఇతరులకు లేనట్టి; రూపవిభవంబునఁ = సౌందర్యాతిశయముచేత; రెండవ మన్మథుండునుంబోనివాని = రెండవ మన్మథుఁడోయనఁదగినవానిని; నలుఁ; కని = చూచి; అంతరిక్షంబునఁ = ఆకసమున, విమానంబులు; నిల్పి; భూతలంబునకుఁ, వచ్చి; వానికి; ఇట్లు; అనిరి.

33. నిత్యసత్యవ్రత = ఎడతెగక నిజముపల్కుటయనునియమముగల; నిమశ్రేశ = ఓనిషధదేశాధిపా; నీవు; మాకుఁ; అమరంగఁ = చక్కఁగాదూతవు ఐ; అభిమతంబు చేయుము = ఇష్టము నెఱవేర్పుము. నావుడుఁ = అనియడుగఁగా; చెచ్చెరఁ = వేగిరముగా; అట్లులచేసెదను. మఱి = అయిన; నాకుఁ; చెపుఁడు అ = చెప్పుడీ. మీరలు; ఎవ్వారలు = ఎవరు; ఏను; మీకుఁ; ఇష్టంబుగాఁ; దూతను ఐ; ఏమి; చేయుదును. అనినఁ; అతనికిఁ; అమరేశ్వ

రుఁడు=ఇంద్రుఁడు; ఇట్టులు; అనియెన్; నేను; ఇంద్రుండను; వీరు; దిక్పాలురు = దిక్కు-లేలువారు; విదితయశులు = ప్రసిద్ధికెక్కి-న కీర్తిగలవారు; ధరణిన్- ఒప్పుచున్న=జరుగుచున్న; దమయంతి సుస్వయంవరమున్; చూచు వేడ్క-న్- వచ్చియున్నవారము. ఈవు; మమ్మున్; నామధేయకీర్తనములన్ = పేరులు పెట్టి పిలుచుటచేత; ఎఱిఁగింపుము= తెలుపుము.

34. అట్లయినన్=నీ వట్లుచేసితివేని; అక్కోమలి=ఆదమయంతి; మాయందున్; తనవలచువానిన్=తానుగోరినవానిని; వరించున్=కోరును. ఇంద్రునకున్; నలుఁడు; కృతాంజలి ఐ=చేతులు జోడించుకొన్నవాఁడై; ఇట్లు; అనియెన్;

35; నన్నున్; ఏకార్థసమవేతున్ = అదేపనితో వచ్చినవానినిఁగా; ఎఱిఁగిఎఱిఁగి=తెలిసితెలిసి; ఇట్టిపనికిన్; పనుపన్ =పంపుట; పాడిఅయ్యె = న్యాయమఁటయ్యా- అనినన్; ఉత్సుకుండవై = వేడ్క-తోఁగూడినవాఁడవై; ఏల; చేసెదను; అంటివి; నీవు; చేయకుండన్=చేయకయుండుట అగునే= యుక్తమగునే.

36. నిన్ను, సత్యసత్యనిరతున్-కాన్ = ఎడతెగక సత్యము పలుకుట యందే యాసక్తునిఁగా, ఎఱిఁగి, ఇక్కా-ర్యంబునకున్, వలను = ఉపాయము, కలుగుట = ఉండుట, ఎఱిఁగి, దూతభావము=దూతకృత్యము, అపేక్షించి = కోరి, పనుపవలసెన్ = పంపవలసివచ్చెను, దేవహితమున్ = దేవతలకుఁగా వలసిన, దీనిన్ = ఈపనిని, తీర్పవలయున్ = నెఱవేర్పవలయును.

37. ఆయుధీయసురక్షితంబు=ఆయుధములను ధరించిన భటులచేఁ జక్క-ఁగాఁ గాపాడఁబడినది, ఐన, రాజగృహంబు = రాజునంతఃపురంబును, ఎట్లు చొఱనగున్ = ప్రవేశింపవచ్చును. అని, శంకింపవలదు = సందేహపడవలదు, దమయంతీనివేశంబున్ = దమయంతియొక్క-యింటు, (ప్రవేశించునప్పుడు) నిన్ను, ఎవ్వరు, వారింపన్ = అడ్డగించుటకు, ఓడుదురు = చాలరు; అనిన, శక్రువచనంబులన్=ఇంద్రునిమాటలచేత, అశంకితుండై = భయములేని

వాఁడై, నలుంఁడు, ఒక్కరుండ=ఒక్కఁడే, విదర్భాపురంబునకుఁ, పోయి, దమయంతిగృహంబు చొచ్చి = దమయంతి యంతఃపురంబునఁ బ్రవేశించి.

38. హంసచేఁ=హంసవలన, తనవినినంతకంటెఁ=తానువిన్నదాని కంటె, రూపవిభవ అతిశయములఁ=సౌందర్యసంపదల హెచ్చులతో, వెల యుదానిని=ప్రకాశించునదియు, సురకన్యకలయట్టి = దేవతాస్త్రీలనుబోలినట్టి సురుచిరశతకన్యకాళిచేఁ=మిక్కిలి యందకత్తెలైననూర్వురుఁపడుచులగు చెలి కత్తెలచే, పరివృత యినదానిని=చుట్టఁబడినదియు, హృదయేశుఁడు=తన మనో వల్లభుఁడు, ఐన, తన్నుఁ (నలుని పేరును అనుట), ఎప్పుడుఁ=ఎల్లప్పుడు, వినుచున్కిఁ = వినుచుండుటచేత, అలయక = శ్రమపడక, ఆశ్వాసిత యినదానిని=ఊఱటనొంది యుండునదియునైన, దమయంతిని, చూచి, నలుండు కందర్పశర అవిద్ధుఁడు=మన్మథబాణములచేఁ గొట్టఁబడినవాఁడు, అంతఁ= తర్వాత, అతనిఁ, చూచి, ఇతఁడు = ఈయుగపమువాఁడు, అపూర్వమను జుఁడు=క్రొత్తమనుష్యుఁడు, ఎందుండి=ఎక్కడనుండి, వచ్చెనో, అనుచుఁ= అదరిపడి, అపుడు, లతాంగులు ఎల్లఁ = స్త్రీలందఱు; ఆసనంబులను = తమకూర్చున్నతావుననుండి; డిగ్గి=దిగి; మనంబులందుఁ = మనస్సులలో హర్షము=సంతోషము; ఎసఁగఁ = హెచ్చఁగా; ప్రత్యుద్గతలు ఐరి = ఎదుర్కొనిరి.

39. దమయంతి మనోభవనిభుఁ = (రూపమున) మన్మథునితో సమా నుండును; అమర ఇంద్ర ప్రతిముఁ=(పరాక్రమున) దేవేంద్రునితోఁ దుల్యుఁ డును; దినకర ఆభుఁ=(ప్రతాపమున) సూర్యునితో సాటియైనవాఁడును; సుధాకరకల్పముఁ=(ఆహ్లాదము గలిగించుటయందు) చంద్రునితో సమానుఁడును వరుణసముఁ = (దయయందు) వరుణునిఁ బోలువాఁడును; ధనదరూపముఁ= (భాగ్యమునందు) కుబేరుఁడేసాటిగాఁ గలవాఁడును; అశ్విసమానుఁ = (చక్కఁదనమున) నశ్విని దేవతలతో నీడగువాఁడును ఐన నిషధపతిఁ = నిషధదేశము నేలికయగు నలుఁ చూచి వైపద్యముతో నన్వయము,

40. వారిరుహనేత్ర=కమలములంబోలు కన్నులుగలదగు దమయంతి, మదనప్రేరితయై = మన్మథునిచేఁ బురికొల్పఁబడినదై, లజ్జ ఉడిగి = సిగ్గుమాలి, భీతిల్లక=భయపడక, బృందారకమూర్తికిన్=దివ్యశరీరము గలవాఁడగు, రాజకుమారునకున్ = నలునకు, మందమంద మృదు ఉక్తిన్ = మిక్కిలితిన్ననైన యింపుమాటలతోఁ, ఇట్లు, అనియెన్.

41. నీవు, మహానుభావుఁడవు=ఎక్కువ మహిమగలవాఁడవు, ఇందులకున్=ఇచ్చటికి, ఏమి కారణంబునన్=ఏనిమిత్తముచేత, ఏకతంబున = ఒంటరిగా, వచ్చితివి, ఇది=ఈయంతఃపురము, అత్యుగ్రశాసనుఁడు = మిక్కిలి కఠినముగా దండించువాఁడు. ఐన మదీయజనకుచేన్ = ఐన నాతండ్రిచేత, సురక్షితంబు అగుటచేన్ = పదిలముగాఁ గాపాడఁబడున దగుటచేత, ఎవ్వరికిన్, చొరన్ = లోపలికి వచ్చుటకు, అశక్యంబు = వీలుగాదు. దీనిన్=ఈయంతఃపురంబును, ఎవ్వరు, ఎఱుంగకుండన్=తెలియకుండులాగున, చొచ్చితివి=ప్రవేశించితివి. నాకున్, మనోవేదనావివర్ధనుండవుఐన = మనస్సులో సంతాపమును పెంచువాఁడవయిన, నీ తెఱఁగు = నీవృత్తాంతము, ఎఱింగింపుము. అనినన్, దానికిన్, నలుఁడు, ఇట్లు, అనియె.

42-43. ఇంతి = ఓదమయంతి, ఏను, దేవదూతను, నలుఁడు, అనువాఁడను, ఇంద్ర ధనద వరుణ యములు = ఇంద్రుఁడు కుబేరుఁడు వరుణుఁడు యముఁడును, నీ స్వయంవరమున్, నెమ్మితోన్=ప్రీతితో, చూడంగన్=చూచుటకు, అరుగుదెంచి=వచ్చి, అబల=ఓధైర్యములేనిదానా, నన్ను మున్న = ముందుగా, నీయొద్దకున్, పుత్తెంచిరి=పంపిరి, మాయందున్=మాలోపల, ఒక్కనిని=ఒకనిని, ఇష్టమతిన్=అపేక్షగల బుద్ధితో, వరియింపన్ = కోరుటకు, తోయజముఖిన్ = తామరపువ్వుఁబోలు మొగముగల యీ దమయంతిని, ప్రార్థింపుము. మా యందలి ప్రియము = మాయందలి కోరికను, సంప్రీతిన్ = ఇష్టముతో, ఒనర్పుము = చేయుము సుమీ.

44. అని, పంచినన్=పంపఁగా, తత్ప్రభావంబునన్ = వారి యనుగ్రహమువలన, అలక్షితుండనై = ఇతరులకుఁ గనఁబడని వాఁడనై, వచ్చితిని.

వాఁడై, నలుఁడు, ఒక్కరుండ=ఒక్కఁడే, విదర్భాపురంబునకుఁ, పోయి, దమయంతిగృహంబు చొచ్చి = దమయంతి యంతఃపురంబునఁ బ్రవేశించి.

38. హంసచేఁ=హంసవలన, తనవినినంతకంటెఁ=తానువిన్నదాని కంటె, రూపవిభవ అతిశయములఁ=సౌందర్యసంపదల హెచ్చులతో, వెల యుదానిని=ప్రకాశించునదియు, సురకన్యకలయట్టి = దేవతాస్త్రీలనుబోలినట్టి సురుచిరశతకన్యకాళిచేఁ=మిక్కిలి యందకత్తెలై నసూర్యోదయపడుచులగు చెలి కత్తెలచే, పరివృత ఐనదానిని=చుట్టఁబడినదియు, హృదయేశుఁడు=తన మనో వల్లభుఁడు, ఐన, తన్నుఁ (నలుని పేరును అనుట), ఎప్పుడుఁ=ఎల్లప్పుడు, వినుచున్కిఁ = వినుచుండుటచేత, అలయక = శ్రమపడక, అర్హ్యాసిత ఐనదానిని=ఊఱటనొంది యుండునదియునైన, దమయంతిని, చూచి, నలుండు కందర్పశర అవిద్ధుఁడు=మన్మథబాణములచేఁ గొట్టఁబడినవాఁడు, అంతఁ= తర్వాత, అతనిఁ, చూచి, ఇతఁడు = ఈయుగపురుషుఁడు, అపూర్వమను జుఁడు=శ్రేష్ఠమనుష్యుఁడు, ఎందుండి=ఎక్కడనుండి, వచ్చెనో, అనుచుఁ= అదరిపడి, అపుడు, లతాంగులు ఎల్లఁ = స్త్రీలందఱు; ఆసనంబులను = తమకూర్చున్నతావుననుండి; డిగ్గి=దిగి; మానంబులందుఁ = మనస్సులలో హర్షము=సంతోషము; ఎసఁగఁ = హెచ్చఁగా; ప్రత్యుద్గతులు ఐరి = ఎదురొలునిరి.

39. దమయంతి మనోభవనిభుఁ = (రూపమున) మన్మథునితో సమా నుండును; అమర ఇంద్రప్రతిముఁ=(పరాక్రమమున) దేవేంద్రునితోఁ గుల్యుఁ డును; దినకర అభుఁ=(ప్రతాపమున) సూర్యునితో సాటియైనవాఁడును; సుధాకరకన్నముఁ=(ఆహ్లాదము గలిగించుటయందు) చంద్రునితో సమానుఁడును వరుణసముఁ = (దయయందు) వరుణునిఁ బోలువాఁడును; ధనదసమసముఁ= (భాగ్యమునందు) కుబేరుఁడేసాటిగాఁ గలవాఁడును; అశ్విసమానుఁ = (చక్కఁదనమున) నశ్విని దేవతలతో నీఁడగువాఁడును ఐన నిషధపతిఁ = నిషధదేశము నేలికయగు నలుఁ జూచి వైపద్యముతో నన్వాయము,

ఇంద్రాదులకున్ = ఇంద్రుఁడు మున్నగు వారియొక్క, ప్రియంబు=ఇష్టమును, చేయుము=నెఱవేర్పుము. అనినన్, దమయంతి, అనవతవదన ఐ = తలవంచు కొన్నదై, తొల్లి=మునుపు, హంసచేతన్=హంసమూలమున, నలున్- (నలుని గుణముల ననుట) విని, వానియందున్ అ = ఆనలునియందే, బద్ధ అనురాగ అయి = ప్రేమను బంధించినదై, నవయుచున్నయది = చిక్కిపోవుచున్నట్టిది. అపుడు, అతనిని ఎఱిఁగి=నలుఁడని తెలిసికొని, తద్వచనశ్రవణదుఃఖాయమాన మానస అగుచున్-తత్ =ఆనలుని, వచన=మాటలయొక్క, శ్రవణ=వినుటచే, దుఃఖాయమాన = దుఃఖము గలదగుచుండు, మానస అగుచున్= మనసుగలదై, ఇట్లు, అనియెన్.

45. ఏను, ఏడన్=ఎచ్చట, ఇంద్రాదులు=ఇంద్రుఁడు మున్నగువారు, ఏడన్=ఎచ్చట, వారలకున్, ఎప్పుడు, మ్రొక్కుదును, నేను, నీధనమ = నీ యొక్క ధనంబయినదానను, భూనాథ=ఓరాజా, నీగుణంబులు = నీసుగుణంబులు, హంసచేతన్= హంసవలన, మనంబునన్, నిల్పియున్నదానను=ఉంచుకొనియుండుదానను, భవన్నిమిత్తంబునన్ = నీరాకకై, ఇట్లు, అఖిలధారుణీనాథసార్థంబు=రాజులందఱియొక్క కూటమును, ఇప్పుడు, రావింపన్ కాన్ వలసెన్=రప్పింపవలసి వచ్చెను. లోకఖ్యాతకీర్తి = జగమెల్లఁ బ్రసిద్ధిచెందిన పేరుగల యోనలుఁడా, కరుణించి= దయతలఁచి, ఇందున్= ఈనాయు, పతిబుద్ధిన్=మగండనెడితలంపును, కావింపుము = ఉంచుము.

46. నీవు, దీనికిన్, ఒడంబడనినాఁడు = ఒప్పుకొననప్పుడు, రజ్జు... లంబులన్-రజ్జు=త్రాళ్ళచేతనో (ఉరిపోసికొనియో), విష = గరళముచేతనో (విసముమ్రింగియో), అగ్ని =నిప్పుచేతనో(చిచ్చున నుఱికియో), జలంబులన్ = నీటిచేతనో (నూయి మొదలగువానియందుఁ బడియో), ప్రాణపరిత్యాగంబు చేసికొందును = ప్రాణములను విడిచెదను. అనిన, దానికిన్, నలుఁడు, ఇట్లు, అనియె.

47. భూరిసత్త్వులు = ఎక్కువ బలముగలవారు, సర్వలోకవిభుల్ = అన్నిలోకములకుఁ బ్రభువులు, విభూతిసమృద్ధులు = ఐశ్వర్యము గలవారు, ఇద్ధ ఉరుకీర్తులు = ప్రసిద్ధికెక్కిన గొప్పపేరుగలవారయిన, అమరఉత్తముల్ = దేవతాశ్రేష్ఠులు, నినుఁ, కోరుచున్నవారు, సురలు = వేల్పులు, నీకుఁ ప్రపన్నులై = నీయెడఁ బ్రేమగలవారయి, ఉండఁగాఁ, వారి పాదరజంబుఁ బోలనివారిన్ = వారియొక్క కాలిదుమ్ముతో సాటికానివానిని; మనుష్యున్ = మానవుని, సంసారిన్ = కుటుంబిని, కోరఁగన్ = కోరుట, చన్నె = యుక్తమా!

48. తరుణీ = ఓజవ్వని, దేవతలకున్ = వేల్పులకు, అప్రియంబులు = అనిష్టములు, కావించి = చేసి, మనుష్యులు, ఇలన్ = పుడమియందు, అధమగతులు = నీచగతిగలవారు, అగుదురు. కావునన్ వారికిన్ = ఆ వేల్పులకు, ఇష్టము, కావింపుము = చేయుము, నన్నున్, ప్రీతిన్ = సంతసముతో, కావుము = రక్షింపుము.

49. అనినన్, దమయంతి, నయన అంతర్గళిత బాష్పధారాకలితకపోలయుగళ-నయన = కన్నులయొక్క, అంతః = లోపలినుండి, గళిత = కారిన, బాష్ప = కన్నీటియొక్క, ధారా = ధారలచే, ఆకలిత = అంతటనిండిన, కపోల = చెక్కిళ్ళయొక్క, యుగళ = జంటగలది, అగుచున్, పెద్దయున్, ప్రొద్దు = చాలసేపు, చింతించి = ఆలోచించి, నీ యభిప్రాయంబునకున్ = నీతలంపునకు, నిరపాయంబు = చెఱుపులేనియట్టి, ఉపాయంబున్ = తంత్రమును, కంటివి = కనుగొంటివి, ఇంద్రాదులు; నా స్వయంవరంబునకున్, వచ్చెదరేని = వచ్చునెడల, వారిసన్నిధిని = వారియెదుటనే, నిన్నున్, వరియించెదను = కోరెదను, అట్లయినన్, నిర్దోషంబు = దోషములేమి, అగును, అనినన్, నలుండు, లోకపాలురపాలికిన్ = లోకపాలురవద్దకు, చని, దమయంతి, పల్కినవిధంబున్ = చెప్పినరీతిని, చెప్పెను. అంతన్ = తరువాత పుణ్యతిథినక్షత్ర ముహూర్తమునన్ = శుభకరమైన తిథినక్షత్రములతోఁ గూడిన శుభముహూర్తమున; దమయంతీ స్వయంవరంబు ప్రవర్తిల్లినన్ = జరుగఁగా.

50. నళినదళనేత్ర=తామర రేకులంబోలు కన్నులుగల యాదమయంతి, నలుని అ కాని = నలునినే తప్ప, (ఒరుల) వరియింపదు-అటె = వరియింపదట, చూతము. అనుచున్, అమరవరులు= వేల్పులలో మేటులు, నలువురును, కడంగి=ప్రయత్నముతో, నలరూపములన్=నలునివేషములతో (కూడి), అతిముదమునన్=ఎక్కువసంతసముతో, ఆ స్వయంవరంబునకున్. వచ్చిరి,

51. అంతన్=ఇట్లు ఇంద్రాదు లందఱు రాఁగా.

52. అంబుజ అక్షి= కమలంబులఁబోలు కన్నులుగలదగు, దమయంతి, సిత...హస్త ఐ-సిత=తెల్లనైన, పుష్పదామ = పువ్వులసరములచేత, అభిశోభిత=అంతట నలంకరింపఁజేయఁబడిన, హస్త ఐ = కరముగలదై (చేతియందుఁ దెల్లనిపూవులు గ్రుచ్చినసరములు పట్టుకొన్నదై), చనుదెంచి=వచ్చి, అమ్మహో...నివహంబున్-అమ్మహోత్సవ=ఆస్వయంవరంబను వేడుకయొక్క, దర్శన=చూచుటకై, ఆగత=వచ్చిన, రాజన్య=రాజులయొక్క, నివహంబున్= సమూహమును, నెమ్మితోడన్=ప్రేమతో, ఈక్షించి = చూచి, నలువురు వేల్పులు=ఇంద్ర యమ వరుణ కుబేరు లనెడి నలువురు దిక్పాలురును, నలున్, తొట్టి = పోలి(నలునివలె), అప్పుడు, ఏక ఆకారులు ఐ = ఒకటే యాకారము గలవారై, ఉన్నన్, అందున్ = వారిలో, నలునిన్, ఏర్పరింపఁగన్ = కనుఁగొనుటకు, నేరక=చాలక, ఇంద్రాదులను=ఇంద్రుఁడు మొదలగువారిని, నలున్, ఎఱుంగు, ఉపాయము, ఇంకన్, ఎద్దియొక్కొ=ఏదో, అనుచున్, సంశయ ఆకుల ఆత్మ ఐ=సంశయముచేఁ గలవరపడిన మనస్సుగలదై, సురలార= ఓ దేవతలారా, నలున్, ఎఱుంగువిధము, నాకున్, చేయుఁడు=తెలియఁజెప్పుడు ఆత్మరూపధరులరు = నిజరూపమును దాల్చినవారలు, అగుడు, అని తన మనములోనన్. పరిదేవనంబు, చేసెను, చింతించెను = వగచెను.

53. దేవతలు; దానిపరివేదనంబు=ఆదమయంతియొక్క చింతను; విని; కరుణించి=దయతలఁచి; అనిమిష లోచనంబులు- అనిమిష = రెప్పపాటులేని; లోచనంబులు = కన్నులును; అస్వేదగాత్రంబులును = చెమటగాఱని మేను

కాలంబు = చాలదినములు, ఉండి; ఒక్కనాఁడు; అతఁడు, అశుచియై = అపరిశుద్ధుఁడై, మఱచి = జ్ఞప్తితప్పి, సంధ్యోపాసనంబు = సంధ్యావందనంబు, చేసినన్ = చేయఁగా, ఉపలబ్ధఅవసరుఁడుఐ =సందుకనిపెట్టినవాఁడై, కలి, నలునందున్, ప్రవేశించి, పుష్కరుఁడు, అనువానిపాలికిన్, పోయి, తన్నున్-ఎఱింగించి = తాను కలిపురుషుఁడని తెలిపికొని, నీవు, నలునితోన్, జూదంబు, ఆడి, వానిరాజ్యంబు, సర్వంబున్ = అంతయును, ఒడిచికొమ్ము = లాగికొనుము, అని, చెప్పి, తానును, వానికిన్ = ఆపుష్కరునికి, విప్రవేషంబునన్=బ్రాహ్మణవేషంబుతో, సహాయుఁడై = తోడ్పడి, అక్షంబులు పాచికలు, కొని = తీసికొని, పుష్కరునితోన్, ఒక్కటన్, కూడ, చని, నలున్, కాంచి, నీవు, మారాజుతో, జూదంబు, ఆడుము, అనినన్.

58. ద్యూతార్థము = జూదమునిమిత్తము, తత్కైతవఆహూతుఁడను= ఆజూదరియగు పుష్కరునిచేఁ బిలువఁబడినవాఁడను, ఐ=అయి, జూదము ఆడకుండుట, ధర్మఅపేతంబు = న్యాయముతప్పినది, అని, అభిముఖుఁడై=ఒప్పుకొన్నవాఁడై, అతనితోఁ = ఆపుష్కరు తో, నలుఁడు, జూదము, ఆడన్, కడంగెన్ = పూనెను.

59. నలుఁడు, కలిప్రేరణంబునను = కలిపురుషుని ప్రోత్సాహముచేత, హృతమతిఐ = బుద్ధిగలగినవాఁడై, నిజఆప్తులు=తనమేలుకోరెడివారు, వారించినన్=అడ్డగించినను, ఉడుగక = వదలక, కలధనములుఎల్లన్=తనకున్న యావదాస్తియు, ఒడ్డుచున్ = పందెముగాఁబెట్టుచు, అలయక=విసుకుచెందక, జూదమునన్, విజితుఁడు అగుచుండెన్ = ఓడిపోవుచుండెను.

60. ఇట్లు, అనేకమాసంబులు= పెక్కునెలలు, దుర్వ్యసనఆసక్తుఁడయి = చెడ్డవ్యసనమగు జూదమునందపేక్షగలవాఁడై, ఆనలుఁడు, వివిధవస్తువాహననివహంబులు=అన్నితెఱఁగులైన పదార్థములయు గుఱ్ఱము లేనుఁగులు మొదలగువానియు సమూహంబును, ఒడ్డి = పందెముపెట్టి, పుష్కరునకున్, ఓటువడన్-పోయినన్ = ఓడుచురాఁగా, పౌరబ్రాహ్మణప్రధానులు-పౌర=పుర

జనులు, బ్రాహ్మణ=ద్విజులు, ప్రధానులు=మంత్రులు, దమయంతీపురస్కృతు లు ఐ = దమయంతిని ముందిడుకొన్నవారై, వచ్చి, వారించి = ఆటంకపెట్టి యు, కలిసమావేశ పరవశుఁడు ఐన = కలిపురుషునియొక్క చొచ్చుటచే నో డలుమఱచినవాఁడయిన, అన్నలుచేతన్, ప్రతిహతులై = ఆఁపఁబడినవారయి, పలుకకుండిరి. అంతన్ = అప్పుడు, దమయంతి, చింతాక్రాంతచిత్త ఐ= దుఃఖ ముచే నావరింపఁబడిన మనస్సుగలదై, (మనోదుఃఖముతో నిండినదై)

61. ఎంత=ఎంతదూరము, ఓటువడినన్=ఓడిపోయిన, అంతియ=అం తమాత్రమె, జూదమునందున్, తగులు = ఆశయు, చలము=పట్టుదలయు,అతి శయిల్లున్=హెచ్చును, ఏమిచేయుదానను = నేనేమి చేయఁగలను, ఇది= ఈజూదము, ఎగ్గునకున్ = కీడునకు, మూలము=కారణము, అని, లతాంగి= దమయంతి, దుఃఖితాత్మఅగుచున్ = మనస్సున దుఃఖమునొందినదియై.

62. అక్షములు=పాచికలు, పుష్కరునందున్=పుష్కరునికి, (షష్ఠ్యర్థంబున సప్తమి) వశ్యంబులుఐ=అధీనములై, ఉనికియున్ = ఉండుటయు, నలునియందున్ = నలునకు, (ఇదియు షష్ఠ్యర్థమున సప్తమి) ఒండువిధములు, అగుటయున్=వేఱు తీరుగలవిగ నుండుటయు, ఎఱిఁగి, నిజ అధీశ్వరునకు = తనమగనికి, అపజయముఅగా=ఓటమియేఅగునట్లు, లక్షించి=ఊహించి, సరసిజ అక్షి=తమ్మిరేకులంబోలుకన్నులుగలదమయంతి, మున్ = ముందుగా, భర్త యనుజ్ఞ=పెనిమిటి యనుజ్ఞను, పడసి= పొంది, వార్ష్ణేయుఁడు, అనుసారథిన్, పిలిచి, ఈస్యందనమునన్ = ఈరథంబునందు, ఇంద్రసేనుఁడు అను ఇక్ష్వాకు మారకున్ = ఇంద్రసేనుఁడనెడి యీచిన్నికొడుకును, ఇంద్రసేన అనుకూఁతున్= కుమారితను, చెచ్చెఱన్ = వేగమే, తోడుకొని, విదర్భకున్=విదర్భాపురికి, అరిగి, గుఱుకొని=యత్నించి, మత్-బంధుజనులయొద్దన్ = నాచుట్టములకడ పెట్టి=విడిచి, సరగ=వేగముగా, రమ్ము, అటంచున్=అనిచెప్పుచు, పంచి=ఆన తిచ్చి, ఆప్తపురోహితమంత్రిబాంధవ అభిమతమున్=ఇష్టులయిన పురోహితు లయు మంత్రులయు బంధువులయు నభిప్రాయమును పొంది (సారథిన్), పుచ్చెను = పంపెను.

63. నలుఁడును, ధరణీరాజ్యముల్ = పుడమియును రాజ్యమును, తలఁగఁగన్ = పోఁగా, సర్వంబును=యావత్తును, అపహృతంబు ఐనన్=దోఁచుకొనిపోఁబడఁగా, కడున్ = మిక్కిలి, తలరి = భయపడి (చింతించి), అశేషరాజ్యవిభవచ్యుతుఁడు ఐ = రాజ్యమంతయుఁ బోఁగొట్టుకొన్నవాఁడై, దమయంతిన్, తోడ్కొని, వెలువడియెన్ = పట్టణమును విడిచిపెట్టెను.

64. పురమువెలి = పట్టణమునకు వెలుపట, మూఁడుఅహోరాత్రములు= మూఁడుదినములు, వసించియున్న, నలుపాలికిన్ = ఆనలమహారాజునొద్దకు, జనవిభుఁడు-ఐన-పుష్కరుశాసనమునన్ = రాజగు పుష్కరుని యానతివలనను, కలికృత...మునన్-కలి=కలిపురుషునిచేత, కృత=చేయఁబడిన, ద్యూత=జూదమువలని, విద్వేషకారణమునన్ = విరోధమను కారణమువలనను, ఎవ్వరును=ఒక్కఁడైనను, అరుగన్ = పోవుటకు, ఓడిరి=భయపడిరి.

65. ఇట్లు, సర్వజనసత్కార అర్హుండు అయ్యున్ = జనులందఱియొక్క మర్యాదలకుఁ దగినవాఁడైనను, నలుఁడు, విధివశంబునన్ = దైవవశంబువలన, ఎవరివలనన్, సత్కారము=మర్యాద, కానక, జలంబు=నీళ్ళే, ఆహారము కాన్ =ఆహారము కాఁగా, తత్పురసమీపంబున్ =ఆపట్టణపుచేరువ, దమయంతీ ద్వితీయుండై=దమయంతియే రెండవదిగాఁగలవాఁడై, ఉండి, బుభుక్షాపీడన్=ఆఁకలిబాధను, సహింప నోపక = ఓర్వఁజాలక, హిరణ్యపక్షంబులతోన్= బంగారు రెక్కలతో, తనముందటన్=తనయెదుటతిరుగుచున్న, పక్షులన్, కని, అవి=ఆపక్షులు, భక్ష్యములు అగును అని=తినఁదగినవని, ఆపక్షులన్, పట్టికొనన్ = పట్టుటకు, సమకట్టి=పూని, తనకట్టినపుట్టంబు=తానుదాల్చినవస్త్రము, వానిపైన్=ఆపక్షులమీఁద, వైచినన్ = వేయఁగా, అవి, పుట్టంబుతోన్ =ఆవస్త్రముతోనే, గగనంబునకున్ =ఆకాశమునకు, ఎగసి=ఎగిరి, నగుచున్ = నవ్వుచు, విగతవస్త్రుఁడు ఐన =కట్టుబట్టలేనివాఁడగు, నలునికి, ఇట్లనియె.

66. పార్థివేంద్రా = ఓరాజాధిరాజా, నీధనంబును, రాజ్యంబును, నికృతిన్ = కపటముతో, కొన్న, అక్షములము=పాచికలము, ఏము,నీవస్త్రము; అపహరింపన్; పక్షిరూపులము ఐ వచ్చి అపహరించితిమి; అని; చెప్పి; చదలన్ = ఆకాశమందు; అరిగెన్ =పోయెను.

67. నలుండును; వానిన్=అపక్షులను; చూచి; విస్మయము=ఆశ్చర్యము; అంది; ఈయక్షంబులదోషంబునన్ కాక=ఈపాచికలద్రోహమువలననే తప్ప, ఏమి; నాకున్; ఇట్టిది; అయ్యెను. (ఈపాచికలవలననే నాకింత యనర్థము సంప్రాప్తమయ్యెను) అనుచు; దమయంతి; కట్టిన; పుట్టంబుచెఱంగు= కట్టుకొన్న చీరపైటకొంగును; కట్టికొనియెను. అట్లు; ఇరువురు = ఇద్దఱు; ఏకవస్త్రులు ఐ=ఒంటిబట్టకట్టినవారై, ఒండొరుల మొగంబులు, చూచి; దుఃఖించుచుండన్; నలుఁడు; దమయంతికిన్; ఇట్లనియె.

68. ఇది; దక్షిణాపథంబునకున్ = దక్షిణదేశమునకు; ఇదియున్= మఱియొక్కటి; విదర్భాపురంబునకున్; ఇది; కోసలకున్ = కోసలదేశమునకు; ఇది; ఉజ్జయినికిన్=ఉజ్జయినీపట్టణమునకును; తెరువులు = మార్గములు; మదిన్ =మనసులో; ఇన్నిటిలోనన్ =ఈదారులలోన; మనకున్=మనము; ఎద్ది=ఏదారి; అరుగన్-అగున్ = పోఁదగును.

69. ఇందుముఖి=చంద్రబింబముఁబోలు మోము గలదానా; అడవులలోనన్; నాతోన్; కడున్ ఇడుములు=ఎక్కుడు శ్రమలు; పడన్ ఓపవు= అనుభవింపఁజాలవు. ఇప్పుడు; నీబంధుజనంబులకడకున్ = నీచుట్టాలదగ్గఱకు; అరుగుము. అనవుడున్=అని చెప్పఁగా; తరుణి=జవ్వని యగు దమయంతి, శోకగద్గద= వ్యసనముచే డగ్గుత్తిక కలది; అగుచున్.

70. అతనికిన్; ఇట్లు; అనియెన్; అనఘ ఈశ = పుడమిఱేఁడా, నీవును, నేనున్, చని, విదర్భన్ = విదర్భయందు, ఇష్టలీలన్ = ఇచ్ఛావినోదముతో, ఉండుదము. మృగా...వనంబులకున్ -మృగ = క్రూరజంతువుల చేత, ఆకుల=నిండిన, ఉగ్ర= భయంకరమైన, వనంబులకున్ = అడవులకు, అరుగన్ ఏల=పోవనేల, ఇడుములు= ఆపదలు, అందన్ ఏల=పడ టకు ఎందుకు?

71. అనినన్, వి.ని, నలుఁడు, అవనత ఆననుఁడు ఐ=తలవంచుకొన్న వాఁడై, నీచెప్పినయట్లు = నీమాటప్రకారమె, విదర్భేశ్వరరాజ్యంబును = విదర్భరాజ్యమును, మనరాజ్యంబు అ = మనరాజ్యమే, ఏను, తొల్లి, అధిక ఐశ్వర్యయుతుఁడను ఐ = ఎక్కువకలిమితోఁ గూడినవాఁడనై, అందులకున్= ఆవిదర్భకు, పోయి, బంధుజనులకున్ = చుట్టాలకు, హృదయము ఆనందము= మనస్సంతోషము; చేసి; ఇప్పుడు; ఇవ్విధంబునన్; సర్వహీనుండనుఐ = అంతయుఁ బోఁగొట్టుకొని; ఎట్లు; పోవనేర్తును = పోవఁగలను. అనినన్; దమయంతి; ఇట్లు అనియెను.

72. ఎందున్=ఎచ్చటను; అఖిలదుఃఖరోగ ఆర్తునకున్=సకలములైన వ్యసనములనువ్యాధులచేత పీడింపఁబడినవానికి; ఔషధంబు = మందు; భార్య అచూవె= పెండ్లామేసుమా; ఒనరన్ = చక్కఁగా; భార్యసమేతుఁడు ఐ = పెండ్లముతోఁగూడినవాఁడై; ఉన్న వానికిన్;ఎంతలుఆపదలు=ఎంతశ్రమములు; అయ్యును=కలిగినను; ఎఱుకపడవు= తెలియవు.

73. ధరణీతలనాథ=ఓపుడమిఱేఁడా; అలయునెడన్=పనిచేయుటచే నలపుచెందునపుడు, డయ్యునెడన్ = దారినడక మొదలగువానిచే శ్రమపడు నపుడు; ఆఁకలియును; తృష్ణయున్=దప్పియు; ఐనయెడన్ = కలిగినప్పుడు; కనుఁగొని=కనిపెట్టి; భార్యయు; పురుషునకున్ = మగనికి; చిత్తమునన్=మనస్సునందు; దుఃఖంబుల్=వ్యసనములు, ఇమ్ములన్ = చక్కఁగా; పాచున్= తొలఁగించును.

74. కావున; ఇది =ఈదమయంతి; మత్-అధీనజీవిత= నాకులోఁబడిన ప్రాణముగలది; అనియున్; అనువ్రతే=నావంటి నియమముగలది; అనుసరించి నదిఅనియు; అనుకంపనీయ = దయచూపఁదగినది; అనియు;నన్నున్; విడువక; నాయనుగమనంబునకున్ = నేను వెంబడినచ్చోటుకు; అనుమతుండవు;కమ్ము= అంగీకరింపుము. అనినన్, అట్లు అ=ఆలాగున నేచేయుదును. ప్రాణసమానవు= నాప్రాణములకు సమానురాలవు; అయిన; నిన్నున్; ఏల; విడుతును;

ఓడక ఉండుము = వ్యసనపడకుండుము. అని నలుఁడు, దమయంతిన్, ఆశ్వాసించుచున్=ఊఱడించుచు, ఒక్కటన్ = కూడి, చనిచని=పోయిపోయి, స్వనంబు=ఏకాంతము, ఐన, విపినంబునన్=అడవియందు, ఒక్కసభన్= ఒక్క రచ్చకొట్టమును, కని, అందున్ = దానియందు, విశ్రమించి, = దిగి, పరుష ధూళిధూసరస్థలంబునన్-పరుష=కఱకైన, ధూళి=దుమ్ముచే, ధూసరిత=పాగవర్ణముగలదిగా చేయఁబడిన, స్థలంబునన్ = తావునందు, శయనించి, మార్గశ్రమనిమీలిత నయనుఁడు ఐ-మార్గశ్రమ = దారినడకవలని యలసటచే; నిమీలిత = మూసికొన్న, నయనుఁడు అయి = కన్నులుగలవాఁడై, దుఃఖంబునన్ = వ్యసనముచేత, కన్నుమొగుడకున్నన్ = నేత్రములు మూతపడకయుండఁగా; నిద్రరాకయుండఁగా, లేచి=కూర్చుండి, తనపాదములయంతికంబునన్ =తనకాళ్ళవద్ద, అతిక్లేశపరవశ అయి=ఎక్కువ దాఁగబడలికచే సొక్కినదై, నిద్రవోయెడు దమయంతిన్, చూచి.

75. ధరణిరాజ్యంబుతోన్=భూమిపరిపాలనంబుతో, ధనము ఎల్లన్= ద్రవ్యమంతయును, పరులచేన్=శత్రువులచేత, అపహృతంబు, అగుటయున్= అపహరింపఁబడుటయు, ఆప్త...జనంబులున్ - ఆప్త = హితము చెప్పువారు, మిత్ర = చెలికాండ్రు; బంధుజనంబులున్ = చుట్టములును; ప్రకృతిజనంబులున్ = మంత్రులును, విడుచుటయును = విడిచిపెట్టుటయు. మహావిపిన భూమిన్ = కాఱడవియందు; పత్నితోన్=భార్యతో; తనపరిభ్రమియించుటయున్=తానుదిరుగుటయు; అప్డు; తలఁచి; శోకించి=దుఃఖించి, ఈతఱిని = ఈజన్మని; తొల్లి; మృదుశయనంబునన్= మెత్తని పాన్పునందు; మెలఁతలు-చెలికత్తెలు; మెలపుతోన్ =జాగ్రత్తతో; అడుగులు ఒత్తన్= కాళ్ళుపిసుకఁగా; నిద్రఅనుభవించు = నిద్రపోవునట్టి; కోమల అంగి = మృదుశరీరముగలది; ఇపుడు; గుఱుకొని=శ్రమపడి; పాంసుస్థలమునందున్=దుమ్ముతో నిండిన తావునందు; నిద్రన్ తెగిలినదియున్ = నిద్ర చెందునదియు; పంకజాక్షి=తామరరేకులంబోలు కన్నులుగలదియగు; ఈచాన; నాకున్;భార్య; ఐ; దైవ ఘటనన్ చేసి=గ్రహచారమువలన; ఇంతదుఃఖంబున్; పొందెను.

76. ఏను, దీనిదుఃఖంబులన్, చూడనోపను = చూడఁజాలను, ఎటు కేని యున్ = ఎచ్చటి కేనియు, పోయెదను, ఇది, నన్నున్, కానక, తనబంధుల యొద్దకున్, పోయి, దుఃఖపడక, ఉండును. అని విచారించి=తలపోసి, పోవన్, సమకట్టి=పూని, ఆకోమలి; మేలుకొనకుండన్, మెల్లన=తిన్నగా, దానివస్త్రం బునందున్, అర్ధంబు=సగము, చించి, తనకున్, పరిధానంబు=కట్టుబట్టగా, చేసికొని, వెలువడి = బయలుదేరి, కొండొక నేలపోయి=కొంతదూరంబుచని, దమయంతియందున్, తన నెయ్యంబు అనుత్రీఁగన్=తన ప్రేమయనెడి తీఁగను త్రెంపన్, నేరక = చాలక, క్రమ్మఱన్ = మరల, అచ్చోటికిన్, వచ్చి

77. కలి=కలిపురుషుఁడు, దమయంతిన్, పాపన్ = విడిపించిపోవు నట్లుచేయుటకు, సమకట్టున్=పూనును, సతిన్ = పతివ్రతయైన, ఆలలనను= ఆసుందరిని, నలుఁడు, దీర్ఘసౌహృదబలంబునన్ = విస్తారమైన చెలిమియొక్క శక్తిచేత, పాయన్ ఓపఁడు = విడచిపోవఁజాలఁడు. ఇట్టులు=ఇవ్విధంబున రెంటన్ చేసి=కలిప్రేమ బలమువలన, ఆనలుఁడు, విమోహరజ్జులన్=మోహ మనెడిత్రాళ్ళయందు, పెనంగి=మెలివడి, గత ఆగత కారి=వచ్చుటపోవుటలను చేయునట్టి, అయిన ఉయ్యెలయునున్ పోలెన్ = ఊయాలవలె, ఊఁగడక = నిలుకడనొందక, ఎంతయున్ ప్రొద్దు=దీర్ఘకాలమునకు, వినిశ్చితాత్ముఁడై = మనమున నిర్ణయము చేసికొన్నవాఁడై, (పై. పద్య. అ.)

78. బాలన్ = ధైర్యములేనిదియగు నిదమయంతిని, ఒక్కర్తన్ = ఒంటరిగా, ఇక్కానపాలుచేసి = ఈయడవిపాలుచేసి, నిష్ఠురుఁడను ఐ = దయమాలినవాఁడనై, ఏను, ఎట్లు, పోవన్ నేర్తును = పోవఁజాలుదును, అనక = అనితలఁపక, కలిచేతన్, ఆకృష్టుఁడు = ఈడ్వఁబడినవాఁడు, ఐన నలుఁడు, విగతకరుణుఁడు ఐ = దయమాలినవాఁడై, దమయంతిని, విడిచి, చనియెన్=వెళ్ళిపోయెను.

79. అంతన్=తర్వాత, దమయంతి, మేలుకని=నిద్రలేచి, తనపతిన్, కానక=చూడక, తనవస్త్రఅర్ధనికర్తనంబునన్=తనచీరలో సగము చింపఁ

బడియుండుటను, చూచి లేచి, నలుగడలను=నాలుగుదిక్కులను, పరికించి = వెదకి, భయశోకవ్యాకులచిత్తవై = భీతిచేతను దుఃఖముచేతను కలవరపడిన మనస్సుగలదై.

80. హా మహారాజ = ఓరాజేంద్రుఁడా, మహా...రాతి...మహాత్ = గొప్పదైన-విశాలమైన, మహీ=భూమియొక్క, రక్షణ = పాలించుటయందు, దక్ష = నేర్పుగలదైన, దక్షిణబాహు = కుడిచేతిచేత, దండిత=శిక్షింపఁబడిన, ఆరాతి = శత్రువులుగల, నిషధరాజాగ్రణి = మేటియైన నిషధదేశాధినాథా, నన్నుఁ, ఇట్లు, వీతదయుండవై=దయలేనివాఁడవై, విడిచిపోవఁ= విడిచిపెట్టిపోవుట, తగును ఏ = యుక్తమా? నీవు, ఎన్నఁడు, ధర్మువుఁ = న్యాయమును, తప్పనివాఁడవు. సూనృతవ్రతరతుండవు = నిక్కము పలుకుటయే ప్రధానవ్రతముగాఁ గలవాఁడవు, ఓడకుము = భయపడకుము. అని; ననుఁ, ఊఱడఁ=నిమ్మళించునట్లు; పలికినపలుకు = చెప్పినమాట, మఱవఁ కఁ = మఱచుట, పాడి అయ్య = న్యాయమయ్యా, పొదలలోనఁ=తీఁగెల గుంపులందు, దాఁగి, పొడసూపక = కనఁబడక, ఇట్లు, ఏల=ఎందుకు; ఉన్నవాఁడవు. ఇట్టి ఉగ్రభావము=ఈలాటికటికితనము, ఏల = ఎందుకు, నీకుఁ; అయ్యెఁ=కలిగెను. ఎటఁ = ఎచ్చటికి, పోదును, ఇంకను, ఉగ్రకాననమునఁ=భయంకరారణ్యమునందు, నిన్నుఁ, ఎట్లు; కాంతును = చూతును.

81. వగవఁ కఁ = యోచింపఁగా; సాంగోపాంగములు = ఆఱంగములు ఆఱుఉపాంగములు కూడిన; నాలుగువేదములయు = నాలుగువేదములయొక్కయు; అధ్యయనము = చదువుట; పొల్పుగా = సరిగా; ఒకసత్యముతో = సత్యమైనమాటను నెఱవేర్చుటతో; ఎన అగునే = సాటియగునా? ఎవ్వియుఁ=ఎట్టిసత్కార్యములును; సత్యంబుఁ = నిక్కము మాటాడుటను; పోలవు అఁట = తూఁగవఁట. సత్యవాక్యము నెఱవేర్పుతో నేవియు సమానములుగావు.

82. ప్రాణసమానవు= ప్రాణములతో సాటివి; అయిన నిన్నున్; అవశ్యంబు=తప్పకను; విడుతున్; అని; పల్కితివి; సత్యప్రతిపాలనంబు =ఆడినమాట నెఱవేర్చుటను; చేయుము. అని ప్రలాపించుచున్ = ఏడ్చుచు; తనయేకాకిత్వంబునకున్ = ఒంటరితనమునకు; అబలభావంబునకున్=తనయాడుతనమునకును; ప్రతిపద...భయంబునకున్ - ప్రతిపదన్యాస = ఒక్కొక్కయడుగెత్తిపెట్టునప్పుడు; జాయమాన=పుట్టుచుండు; కంటక = ముండ్లు; మృగ=మృగములు; పన్నగ=పాములు; వీనివలని; భయంబునకున్=వెరపునకు; వగవక = చింతింపక నిజనాథునసహాయత్వంబునకున్ = తన పెనిమిటితోడులేమికి; దుస్సహ ... త్వంబునకున్ - దుస్సహ=ఓర్వరాని; క్షుత్ = ఆఁకలి; పిపాసా=దప్పి; వీనివలనఁగలిగిన; శ్రమ=బడలిక చేతనైన; ఆకులత్వంబునకున్ = కలవరపాటునకు వగచుచున్ = చింతించుచు. (పై. పద్య. అన్వ.)

83. అలయుచున్ = బడలిక చెందుచు; పులుఁగుల యెలుఁగులకున్ = పక్షులకూఁతలకు; ఉలుకుచున్ = భయపడుచు; ఉగ్రఆతపమునకున్ =తీక్ష్ణమైన యెండకు; ఓపక=ఓర్వఁజాలక; వృక్షంబులనీడలన్= చెట్లనీడలయందు; నిలుచుచున్; ఎలుఁగులన్ = ఎలుఁగుబంట్లను; పులులను; చూచి; భయమున్ కొని = వెఱచి. వగవగచున్ = చింతించును.

84. లతాంగి = తీఁగవంటి మేనుగల దమయంతి; ఏచినపాదలన్ =క్రిక్కిఱిసియున్న పాదలను; పడల్పడన్ = ప్రోగులుపడునట్లు; త్రోఁచుచున్; ముండ్లకనున్; అల్లన్ = మెల్లఁగా; దూరముగా; తొలఁగుచున్; దిక్కులు= నలువైపులు; చూచుచున్; తొడరుచున్=తొట్రుపడుచు; త్రెళ్ళుచున్ = క్రిందఁబడుచు; లేచుచు; సంచరించుచున్ = పణకుచు; అరిగెన్=పోయెను.

85. ఇట్లు; అరుగుచున్నదమయంతి; అంతికన్యస్తచరణ అయినన్ = సమీపమునందుంపఁడిన పాదములుగలది కాఁగా; సమీపమున పాదము లెత్తి పెట్టఁగా, దానిన్ = ఆదమయంతిని; ఆహారఅర్థి ఐ — ఆహారము గోరినదై; ఒక పన్నగంబు= ఒకపాము; పట్టుకొనెన్=పట్టుఁగా; ఆకోమలి = ఆమెత్తని మేనుగల దమయంతి; మొసలనేరక = కదలఁజాలక.

86. ఇంకన్ విన్ = ఇఁక మీఁదనైనను; నన్నున్ = నా మొఱను, ఏల; ఆలింపవు = వినవు. నాథ = నా ప్రాణరక్షకా; నాకున్; శరణము; అగుము = రక్షకుఁడవగుము. అనుచున్; అఱచుచున్నన్=కూయుచుండఁగా; దాని ఆక్రందనధ్వని = దానియొక్క చప్పుడును; వినుచున్; ఒక్క-ఎఱుకున్= ఒక ఎఱుకువాఁడు; వేగ = త్వరగా; వచ్చి.

87. తనపట్టిన సురియన్=తానుధరించిన కత్తిచేత; ఆ వెనుఁబాముపద నంబు=ఆకొండచిలువయొక్క-నోటిని; వ్రయ్యన్ = చీలునట్లు; తటిగినన్ = నఱుకఁగా; రాహుముక్తఅయిన చంద్రరేఖయున్ పోలెన్ = రాహువు నోటినుండి విడువఁబడిన చంద్రరేఖవలె; అజగరముఖంబువలనన్ = ఆకొండ చిలువయొక్క-నోటినుండి; వెలువడిన = విడిపించుకొనివచ్చిన; దమయంతిన్; ఆశ్వాసించి = ఊఱడించి; తత్ సమీప ...స్నాతను-తత్ = ఆప్రదేశమునకుఁ సమీప = దాపుననున్న; సరోవర=దివ్యమైన కొలనియందు; స్నాతను=స్నాన ముచేసినదానిని; వన్య...హారనుగాన్-వన్య = అడవియందు దొఱకెడి; స్వాదు = తియ్యని; ఫల = పండ్లు; ఆహారముగాన్=ఆహారముగాఁగలదానిని గా; చేసి; నేదదీర్చి=శ్రమపాపి, నీవు; ఎవ్వరిదానవు=ఎవ్వరికి సంబంధించిన దానవు; ఏకతంబ, ఒంటరిగా; ఇవ్వనంబునకున్; ఏలవచ్చితివి; అని; అడిగి, మృదుభాషిణి=తిన్నగా మాటాడునది; ఐన ఆకోలుని వలనన్; అంత వృత్తాంతంబు=సంగతియంతయును; ఎటింగి=తెలిసికొని.

88. రజనికరఆననన్=చంద్రునివంటిముఖముకలదియును; మేచకకుంతల రాజితన్=నల్లనికురులచేఁ బ్రకాశించునదియును; విలసద్గజగామినిన్ = గొప్ప యేనుఁగువలెఁ దిన్నగా నడుచునదియును; చందనగంధన్ = శ్రీచందనమువంటి మేనితావిగలదియును; ప్రకాశితకాంతిసమన్వితన్ = వెలిఁగెడి కాంతితోఁగూడి నదియును; పంకజదళలోచనన్ = తామరఱేకులంబోలిన కన్నులుగలదియును నైన; రాజసుతన్ = రాజపుత్రికయగు దమయంతిని; చూచి, కిరాతుఁడు— ఎఱుకువాఁడు; కామ...హతుఁడై-కామ = మన్మథునియొక్క-: నిశాత =

వాఁడియైన; శర = అమ్ములచేత, అహతుఁడై = బాగుగాచేయఁబడినవాఁడై అనింద్యచరిత్రతమఁ = పొగడఁదగిన నడవడిగల; లతాంగికిఁ = దమయంతికి వేడుకతోఁ = అపేక్షతో; నిజవ్యాదయంబు = తనమనస్సులోని యభిప్రాయమును; ఎఱింగించెఁ = తెలిపెను.

89. అగ్నిశిఖయుంబోలెఁ = నిప్పుమంటవలె; అంతటను = తాఁకుట కును; డాయను = దగ్గఱకువచ్చుటకును; చూడఁ = చూచుటకును; రాని యట్టి = వలనుపడనిదగు; శుభచరిత్రఁ = పావనంబైన నడవడిగల యాదమయంతిని; ఎఱుక = జ్ఞానము; లేనియట్టికఱకు ఎఱుకు= లేనట్టి క్రూరుఁడైన బోయవాఁడు; కాదు అనక=పరస్త్రీనిఁగోరుట తగనిదనియెంచక; తనమఁ; ఆయువు=జీవితకాలము,అల్పముఐనఁ=తక్కువపడఁగా,అపేక్షించెఁ=కోరెను

90. దమయంతియుఁ; వానిఁ = అయెఱుకువానిని; అలిగిచూచి = కోపముతోచూచి, ఏను, పతివ్రతను, ఐతిని, ఏని, ఇద్దరాత్ముఁడు=చెడ్డతలంపు గలవాఁడు, ఐనకిరాతుఁడు; మృతుండు; అయ్యెడుఁ అని=చచ్చునుగాకయని, శాపంబు; ఇచ్చినఁ, వాఁడు; అప్పుడు = ఆతత్క్షణముననే, అగ్నిదగ్ధంబుఐన వృక్షంబునుంబోలెఁ=నిప్పుచేఁ గాలిన చెట్టువలె; విగతజీవుఁడు ఐ=ప్రాణము పాసినవాఁడయి, పడియెఁ; క్రిందఁబడియెను. అట్లు; పరమపతివ్రతాత్వ ప్రభావంబునఁ = ఎక్కువైన పాతివ్రత్య మహిమచేత;

91. బాల=ముదియయగు దమయంతి,హృదయమునఁ=మనస్సునందు; నృపశార్దూలుఁ=రాజులలో శ్రేష్ఠుఁడైన, నిజాధీశుఁ=తనభర్తనునిలిపి; దుష్ట...వళికిఁ—దుష్ట= చెడ్డ; ఉరగ=పాములు,శార్దూల=పులులు, అఖిల=క్రూరము లైన, మృగ అవళికి=మృగముల గుంపునకు, భయము, అందక.ఓలిఁ అ=వరుసగానే; ఉగ్రఅటవిలోఁ=భయంకరమైన యడవిలో; అరిగెఁ = పోయెను.

92. మఱియుఁ = ఇంకను.

93. సహకార=తియ్యమామిడిచెట్టా; మత్ప్రియసహకారుఁ = నాకు నెయ్యంపుఁజెలికానిని; పున్నాగ=సురపొన్నచెట్టా, పున్నాగుఁ = పురుషుల

లో నుత్తముని. తిలక=ఓతిలకవృక్షమా;భూభువనతిలకుఁడ= భూలోకంబునకు దిలకముమాడ్కిఁ బ్రకాశము గలిగించువానిని; చందన = ఓగంధపుఁజెట్టా; బుధహరిచందనుఁడ=పండితులకుఁ గల్పవృక్షమువంటివానిని; పుష్పితాశోక=పూఁచినయశోకవృక్షమా;సుహృజ్జనశోకదమనుఁడ = ప్రేమించువారి దుఃఖమునుబోగొట్టువానిని; వకుళ=పొగడచెట్టా; కులఏకదీపకుఁడ = కులమునకంతటికిముఖ్యప్రకాశకుని; విభీతక=ఓతాండ్రచెట్టా; భయ...హరుఁడ-భయ= వెఱపుచేత, భీత = దిగులుపడినవారియొక్క; ఆర్తి = బాధలను; హరుఁడ=పోఁగొట్టువాని కాన=ఓయరణ్యమా; లోకోత్తరుఁడ= జనులలోనుత్తముని; ప్రీతితోడఁ = ప్రేమతో; కానరుఏకానరు ఏ = చూచితిరా చూచితిరా;అని; తోయజఅక్షి = కమలములుంబోలుకన్నులుగలదమయంతి; మ్రాని మ్రానికిఁ = చెట్టుచెట్టునకు; అరిగిఅరిగి = పోయిపోయి; అడుగును, అడుగులు=అఱకాళ్ళు; ఎండవడిఁ = ఎక్కువయెండకు; పురపురఁ=పురపురమని; పొక్కఁ = బొబ్బలులేవఁగా; నిర్ఝరఅంతరములఁ = సెలయేళ్ళనడుమ, నిలుచుఁ = నిలువఁబడును. తరులగిరులయెడలఁ=చెట్లయొక్కయు; కొండలయొక్కయు సందులందు; పొలుచుఁ = కనుపట్టును. ఉరుగుహాగృహములఁ=గొప్పవైన గుహాలనెడి గృహములయందు; తొంగి తొంగిచూచుఁ.

94. ఇట్లు దమయంతి; నిజనాథుఁ=తనమగనిని; అన్వేషించుచుఁ = వెదకుచు; భీషణ అరణ్యంబునఁ = భయంకరమైన యడవియందు; తిరుగునది = సంచరించుచు; ముందటఁ = ఎదుట. (పై. ప. అ.)

95. అంభోరుహ అక్షి=తమ్మిరేకులవంటి కన్నులు గలదియగు దమయంతి; వారిభక్షులు = నీళ్లేయన్నముగాఁగలవారును; పర్ణభక్షులు=ఆకులేయాహారముగాఁ గలవారును; వాయుభక్షులు = గాలియే యాహారముగాఁగల వారును, శాకనీవారభక్షులు=కూరగాయలునివ్వరిధాన్యము నాహారముగాఁగల వారును; వృక్ష...సక్తులు-వృక్షమూల=చెట్లమొదళ్ళయందు; నివాస=ఉండుటయందు; సక్తులు=ఆసగలవారును; ఐ; తపంబు=తపస్సు; అరఁ = తృప్తిగా చేయు, మహాముని ఇంద్రులయాశ్రమంబు = మహర్షులతపోవనంబును; పురా

సమార్జిత పుణ్యకర్మఫలంబునన్ = తొలిమేన సంపాదింపఁబడిన పుణ్యకర్మల యొక్క ఫలములచేత, ఎడన్ = దవ్వునందు, కాంచెన్ = చూచెను.

96. ఇట్లు, మృగ...నిరంతరంబు-మృగ = జంతువులు, వ్యాళ = పాములు, తస్కర=దొంగలు, కిరాత=బోయలు, పర్వత=తిప్పలు వీనిచే, నిరంతరంబు,దట్టమైనది, అయిన కాంతారంబునన్ = అడవియందు, పుణ్యనదీతీరంబునందున్ = పరిశుద్ధమైన యేటిగట్టునందు, ఒక్కమునిపల్లెయందు = ఒక ముని యాశ్రమంబున, వసిష్ఠ...సదృశులు ఐన = వసిష్ఠుఁడు, వామదేవుఁడు, వాలఖిల్యుఁడు, భృగువు, నారదుఁడు వీరితో సమానులైన, మహామునులన్= గొప్పఋషులను, కని, నమస్కరించి, ఉన్నన్ = వారియెదుటను నిలువఁబడియుండఁగా, ఆమునులు, దమయంతిన్ జూచి, అచ్చెరువడి = ఆశ్చర్యమునొంది, అవ్వా=అమ్మా! నీవు, ఎవ్వరిదానవు =ఎవనిభార్యవు, ఈవనదేవతవే, దేవభామినివే=అచ్చరవే, దివ్యంబు = శ్రేష్ఠము, అయిన ఈతేజంబుతోన్, ఏల క్రుమ్మరెదవు=తిరిగెదవు, అనినన్, వారలకున్,దమయంతి,ఇట్లు, అనియెన్.

97. వినుఁడు, ఏన్, ధరిత్రిన్ = పుడమియందు, పుణ్యశ్లోకుఁడు, అనఁగన్ = అనునట్లును, సదా=విడువక, యజ్ఞనిరతుఁడు = యాగములు చేయుటయందు శ్రద్ధగలవాఁడు, అనఁగన్ = అనునట్లు, తనరిన =ఒప్పిన, నలునిభార్యను, సజ్జననుతన్ = సత్పురుషులచేఁ గొనియాడఁబడుదానను, దమయంతి అనఁగన్ చాలినదానను = దమయంతి యను పేరుతో నొప్పుదానను.

98. విధికృతంబునన్=దైవవశంబుచేత, నన్నున్, పాసి=వదలి, హృదయేశ్వరుఁడు = నామనోనాయకుఁడు, ఎటకేనియున్ = ఎచ్చటికో, పోయినన్=పోఁగా, తత్...చిత్తను ఐ-తత్ = ఆనామనోవల్లభుని యొక్క, అన్వేషణ = వెదకుటయందు, ఆసక్త = తగులుగలిగిన, చిత్తనై=మనస్సుగలదాననై, విపిన పరిభ్రమణంబు = అడవియందుఁ దిరుగుట, చేసెదను, ఈతపోవనంబునకున్ = ఈయాశ్రమమునకు వచ్చి, నలుఁడు, ధన...ర్ధుండు అయి -

భవత్ = తమయొక్క, పాద=కాళ్ళకు, అభివందన=మ్రొక్కుటచేత, కృతార్థుఁడు అయి = ధన్యుఁడై; ఎక్కడకుఁ = ఏతట్టునకు, పోయెఁ, అతని పోయినవలను = అతఁడుపోయినదిక్కు; ఎఱుఁగుదురేనిఁ = (మీరు) తెలిసికొనియుందురేని, ఆనతిండు = తెలుపుఁడు. కొన్నిదినములలోనఁ = స్వల్పకాలములోపల, తద్దర్శనంబు = అతని సోఁబడి, దొరకనునాఁడు, దేహంబు విడుతును. అని; ఏడ్చుచున్నదానిఁ, చూచి, కరుణించి = దయతలఁచి; మునులు = ఋషులు, ఇట్లు అనిరి.

99. వనజ ఆయత అక్షి = తామరరేకులమాడ్కి విశాలమైన కన్నులుగలదానా; తివిరి=ప్రయత్నపడి, భూజననుతుఁ=పుడమియందలి సకల జనులచేఁ గొనియాడఁబడువాని, ఎప్పటియట్ల=యథాప్రకారముగా; తన పురమునఁ = తనపట్టణమందు, తనరెడువానిఁ = ఒప్పినవానిని, నలునిఁ, కతిపయ దినంబులఁ = కొన్నిదినములలోపల, చూడంగఁ, కాంతువు=చూడఁగలుగుదువు.

100. మేము; తపోదృష్టిఁ = జ్ఞానదృష్టిచేత; చూచితిమి=కనుగొంటిమి. దుఃఖింపక ఉండుము. అని, తాపసులు; తమయగ్నిహోత్రంబులతో; అపార...లతోఁ-అపార = విస్తారమైన; ఫల=పండ్లచేతను; పుష్ప=పూలచేతను నిండిన; తరు=చెట్లతోఁగూడిన; నదీ=ఏళ్ళచేత, రమ్య = అందమైన; తపోవనంబులతో; తారు=ఆమునులు; అదృశ్యులు ఐనఁ = కనఁబడకపోఁగా; చూచి; దమయంతి, ఇది కలయో, నిక్కంబో=నిజమో అని; విస్మయంబు; అందుచుఁ = వింతపడుచు, చని; ముందటఁ=ఎదుట; ఒకచనుపఁ = ఒక్కబిడారును; కని; త్రాసిఁ; చూచునపుడు; అందలిజనంబులు; పైపద్యములోనన్వయము.

101. పాంసుజాలంబు=ఎక్కుదుమ్ము; పైఁ=మీఁద; ప్రాఁకినఁ=క్రమ్మఁగా; కరము=మిక్కిలి; రూక్షములు=బిరుసులు;అయిన, ఊర్ధ్వఅలకముల దానిఁ=పైకిరేఁగినముంగురులుగలదానిని, అతిమలినంబు = మిక్కిలిమాసినది; ఐనఅర్ధవస్త్రంబునఁ=సగముకోకచేత; ఆవృతంబు=కప్పఁబడినది; అగు; దేహ

యష్టిదానిన్ = దండమువంటి దేహముగలదానిని, ఆఁకలి, తృష = దప్పి, నిద్ర, అనువానిన్, ఎఱుఁగక ఉన్మాదినియున్ పోలెన్ = ఉన్మాదరోగము గలదానివలె, ఉన్నదానిని, దమయంతిన్, చూచి, అందున్ = వారిలో, పిశాచంబు = దయ్యము, అని, పఱచిరి = పరుగెత్తిరి. కొందఱు, భయమున్, పొందిరి. కొందఱు, అధికహాసంబు చేసిరి = పకపకనవ్విరి. అడవిన్ = అడవిలో ఏమి, రోసెదు = వెదకెదవు. (అని) కొందఱు, అనిరి. కొందఱు, నీవు, వేల్పువు = దేవతవు, ఔదువు, అని మొగిన్ ఆ = పూనికతోనే, కేలుమొగిచి = చేతులుముడిచికొని, మ్రొక్కిరి. అంతన్ = అటుతర్వాత.

102. దమయంతియున్, సార్థవాహులన్ = బిడారును, చూచి, ఇమ్మహాగహనంబునన్ = ఈగొప్పయడవియందు, ఇట్టి, జనసంకులంబు = జనులచే నిండినది, అయిన, సార్థంబు = బిడారు, కానంబడియెను. ఎట్టిపుణ్యంబో = ఏమినాపుణ్యమో, అనుచున్, వారలకున్, ఇట్లు, అనియెన్.

103. ఏను; నలుభార్యను, పుణ్యవిహీనతన్ = పాపముచేత (పుణ్యఫలంబు లేకపోవుటచేత,) పతిన్ = భర్తను, పాసి, నవసి = దిగులుపడి, ఏకాంతముఅ = ఒంటరిగా, ఈకాననన్ = ఈయడవియందు, పరిభ్రమించెదను = తిరుగులాడుచున్నాను. అమరసదృశున్ = వేల్పులతో సాటియైనవానిని, కరుణాత్మున్ = దయాస్వభావంబుగలవానిని, నలున్, కానరు-ఏ = చూడలేదా.

104. అనినన్, దమయంతికిన్, ఆసార్థవాహాధ్యక్షుఁడు = ఆబిడారుయొక్క యజమానుఁడు, శుచి అనువాఁడు, ఇట్లు, అనియెన్.

105. ఇవ్వనంబునన్, నలున్, కానము = (మేము) చూడలేదు. ఎప్పుడును, ఉగ్రకరులన్ = భయంకరములైన యేనుఁగులను, సింహంబులన్, ఋక్షంబులన్ = ఎలుఁగుబంటులను; కాంతుము. ఇది = ఈయడవి; మర్త్యులకున్ = మానవులకు, అవిషహ్యము = చొఱరానిది, దీనన్ = ఈయరణ్యమందు ఆతపంబు = ఎండ, సూఁరుడు - ప్రవేశింపదు.

106. అనినఁ = అనిచెప్పఁగా, ఇచ్చనుప=ఈబిడారు, ఎటఁ, పోయెదుఁ, అని, అడిగినఁ, ఇది=ఈబిడారు, చేదిపతి = చేదిదేశపురాజు; అగుసుబాహుపురంబునకుఁ=సుబాహువుయొక్క పట్టణమునకు, పోయెదును, అని, చెప్పినఁ; అట్లువేని = అలాగైనట్టయితే; ఏను, మీతోడఁ, వచ్చెదను, అని, పరమపతివ్రత = మహాపతివ్రతయగు దమయంతి, పతిదర్శనలాలసవి = భర్తనుచూచుటయందాతురయై. మునులపలుకులు; తలంచుచుఁ, సార్ధవాహసమూహంబులతోడఁ = బిడారుతోడ, అరిగినఁ = వెళ్ళఁగా.

107. ఆచనుప = ఆబిడారు; కడుఁ = మిక్కిలి; ఎండ; ఎక్కునంతకుఁ=ఎక్కునంతవఱకు, ఊడుగక = విడువక, ఉగ్రాటవిలోఁ=భయంకరమైన యడవియందు నడచి; బహుశీతజలములఁ = మిక్కిలి చల్లనినీటిచేత, బెడఁగు = రమ్యము; అగు, ఒకచెఱువు ఒద్దఁ = సొంపయినయొక చెఱువుగట్టున, పెద్దయుఁ, మిక్కిలి; దప్పిఁ = దాహముచేతను; విడిసెఁ=దిగెను.

108. అంతఁ = తరువాత.

109. అర్ధరాత్రమునప్పుడు = సగమురాత్రియందు; అందులకుఁ = ఆచెఱువులోనికి, గజయూథములు = ఏనుఁగులగుంపులు, జలకాంక్షఁజేసి = నీరువట్టుచేత, అంబుధివిమలజలంబులు=సముద్రమునందు నిర్మలంబులైన నీళ్ళు; ఆస్వాదింపఁ=త్రాగుటకు, చనుదెంచు జలధరసమితియట్లు=వచ్చునట్టి మేఘపంక్తియో యనునట్లు, ఏతెంచెను = వచ్చెను. చనుపలోఁ = ఆబిడారులో నిద్రాఅవసక్తులుఐ = నిద్రయందుఁ జిక్కినవారై, మైమఱచి నిద్రించువారై; ఉన్నవారు, ఉన్నతద్విపములఉగ్రపాదహతిఁజేసి–ఉన్నత = ఎత్తైన, ద్విపముల=ఏనుఁగులయొక్క; ఉగ్ర=గొప్పవైన; పాద = కాళ్ళయొక్క; హతిఁజేసి=త్రొక్కుడువలన; భిన్నఅంగులు=చేతులు, కాళ్ళు మొదలగునవి విఱిగినవారు, ఐరి. అందుఁ=వారిలో,ఉక్కుఅడఁగి=ధైర్యమువీడి, కొందఱు, అఱచి

=కూఁతలుపెట్టి, ప్రాణభీతిన్=ప్రాణములు పోవునని యెడిభయముతో, పటిచి=పరుగత్తి, మహీజములు=చెట్లు, ఎక్కి=ఎక్కి, చనుప=బిడారు, వెనుపు అటి=సంతోషంబువీడి; అనివతుసిరి అపోలెన్ = అడఁకువలేనివానిసంపదవలెనై, అడఁగి=తగ్గి, విరసి=చిందరవందరయై, చనియెన్=పోయెను.

110. అట్టి సంక్షోభంబునన్ = అటి కలవరపాటునందు; మరణంబునకున్ తప్పి=చావునుండి తప్పించుకొని, దమయంతి, ఆత్మగతంబునన్=తన మనస్సులోపల నే, (సై ప. అ)

111. విధి=దైవంబు, జీవిత అర్థులు ఐన = బ్రతుకుటయం దపేక్షగలవారగు, జీవులన్=ప్రాణులను, సుఖసుప్తులు ఐనవారిన్=హాయిగా నిద్రించువారిని; అఱవన్ అఱవన్ = (వారు) కూఁతలు పెట్టుచున్నను, చంపెను. మరణకాంక్షన్=చావఁగోరికతో, ఉన్న, మగువన్=స్త్రీనైన; నన్నున్; చంపఁగన్=చంపుటకు, మఱచెను. (అది=ఆవిధి) కరంబు=మిక్కిలి; మంద బుద్ధి=బుద్ధిలేనిది.

(విధి చావనున్న వారిని జంపక, బ్రతుకఁగోరువారిని జంపెను గనుక మూఢబుద్ధిగలవాఁడని దమయంతి విసుగుచే దైవమును దూరెను.)

113. ఈచనవుతోన్=ఈబిడారుతోఁగూడ; చని=వెళ్ళి; ఈవనక్లేశంబున్=ఈయరణ్యవాసదుఃఖంబు; తలఁగుదును=పాయుదును. అని, బుద్ధిన్=మనస్సునందు; తలఁచి; ఉన్నన్=ఉండఁగా, ఉరుతరసార్థపయోరాశి – ఉరుతర=మిగులగొప్పదైన; సార్థ=వర్తకుల బిడారనెడి; పయోరాశి=సముద్రము; హాస్తియూథ అగస్త్యుచేన్=ఏనుఁగుల గుంపనెడి యగస్త్యమహామునిచేత, సీతము అయ్యెన్ – త్రాగఁబడెను. (తొల్లి అగస్త్యమహాముని పుడిసెడితో త్రాగి, సముద్రమును బొట్టు నీరు లేకుండఁ జేసెనట. అట్లె యాయేనుఁగుల గుంపు బిడారునంతయుఁ గాలిక్రింద వేసి త్రొక్కి చంపివేసెను. కనుక బిడారంతయు నిహాతి మాయెనని తా. రూపకాలంకారము) అడియున్ = అట్టిదియు, తొలుమేనన్=మునుపటిజన్మమునందు; దుష్కృతశక్తియో = పాపబలమో; వగవన్ కన్ = ఆలోచింపఁగా; నాస్వయంపరమునాఁడు =

నా పెండ్లియప్పుడు; సురవరులు=దేవతలలో మేటులగు ఇంద్రాదులు; అర్థులు ఐ=నన్ను గోరినవారై; చూచుచుఁ; ఉండఁ; కఁ; నలుఁ; వరియించిననాఁటి యెగ్గు=కోరిననాఁటి తప్పిదమును; తలఁచి; వేల్పులు, ఇట్టి యాపదలు=ఇట్టికష్టంబులు; చేసిరి ఓ=కలిగించిరో; అమరకోపమునఁ అ = దేవతల యాగ్రహముచేతనే; ఈ వియోగదుఃఖము = ఈ యెడఁబాటువలని వంత; నాకుఁ, కలిగెను. ఇంకఁ ఏమి; చేయుదును; అనుచుఁ; అంబుజాక్షి = తమ్మికంటి; వగచుచుండెఁ=దుఃఖించుచుండెను.

113. ఇట్లు దుఃఖించుచు; దమయంతి; ప్రభాతంబు ఐనఁ = తెల్లవాఱఁగా; హతశేషులు అయినవారలతోఁ = చావఁగా మిగిలినవారితో; అనవరతప్రయాణంబులఁ = ఎడతెగనిదారినడకలచేత; చేదిపతిపురంబు = చేదిరాజు పట్టణంబును; చొచ్చి = ప్రవేశించి; జనసంకులంబు = జనులచేఁ గ్రిక్కిఱిసినది; అయిన; రాజమార్గముఁ=రాజబాటను; తఱియఁ = సమీపింపఁగా; వచ్చుచున్న దానిఁ = వచ్చునదియు; దినకర...సరంబు- దినకర= సూర్యునియొక్క; ప్రభా = కాంతులయొక్క; పటల = సమూహముచేత; ధూసరంబు = తెల్లవల్లవన్నెగలసినది; అయిన; దివాతనచంద్రరేఖయుఁ పోలెఁ = పగటిపూఁటనుండెడి చంద్రరేఖవలె; దీప్తిహీనయై = కాంతిలేనిదై; డస్సియుఁ=అలసటనొందియు; రమ్య ఆకృతి ఐనదాని = చక్కని రూపంబుగలదియునైన యాదమయంతిని; ప్రాసాదతలగత = మేడమీఁద నున్నది; ఐన; రాజమాత=రాజుతల్లి; ఆ దమయంతిఁ; దవ్వులఁ = దూరముననె; కని; తన దాదికిఁ; ఇట్లు; అనియెఁ.

114. ధూళిధూసర అలకములు=దుమ్ముచే నిండిన ముంగురులు; తూలుచుండఁ=రేగియుండఁగా; జీర్ణమై=చినిఁగినదై; కడుఁ = నిక్కిఁ; మాసిన చీరఁ; కట్టి; అబల = ఒకానొకపడుచు; ఉన్మత్తవేషిణి = పిచ్చివేషము ధరించినది; ఐనలచ్చియుఁ పోలెఁ = లక్ష్మీదేవి వలె; ఇటఁ = ఇచ్చటికి; వచ్చుచున్నది; దానిఁ; కంటివి ఏ = చూచితివె.

115. అకోశ్యమతి యందుఁ = అచిన్నదాసియందు, నాకుఁ, అతిస్నేహంబు=ఎక్కువప్రేమ, అయినయది=కలిగినయది. దానిఁ, తోడ్కొని=పిల్చుకొని, రమ్మ;అనినఁ,అదియుఁ=అదాదియు; దమయంతిఁ, తోడ్కొని=పిల్చుకొని: రాజమాతయొద్దకుఁ=రాజుగారితల్లియొద్దకు; చనినఁ=పోఁగా, రాజమాతయుఁ; దానిఁ; చూచి; నీవు; ఎవ్వరిదానవు = ఎవ్వనిభార్యవు? ఇట్లు; ఏల; దుఃఖ ఆవేశ వివశవు = దుఃఖముయొక్కపూనికచే, పరవశవు, అయి ఉన్నదానవు; చెప్పుము. అనినఁ; దమయంతి; ఇట్లు, అనియెఁ.

116. అవ్వ = ఓయమ్మా! జితవైరి = శత్రువుల గెల్చువాఁడయిన, మత్పతి=నామగఁడు, జూదముఆడి; నిర్జితుఁడుఐ = ఓడినవాఁడై, చనినఁ = (అడవులకు) రాఁగా, పతితోడఁ = మగనితోడ; నీడయుఁ పోలెఁ=నీడవలె, నేనును, పాయక = విడువక; అరిగి; అతిబుభుక్షాఆతురుఁడు=ఎక్కువయాఁకలిచే డస్సినవాఁడు; ఐనపతిచేతఁ, దైవఅనుమతిఁ చేసి = భగవదనుగ్రహమువలన; వంచితనైతిని = మోసపుచ్చఁబడితిని; ఒక్కచోటఁ; మఱచి, నిద్రించి. (పై. ప. అ.)

117. అంతనుండియుఁ = అది మొదలుకొని; అమ్మహానుభావుఁ = ఆ మహాపురుషుని, ఏకవస్త్రుఁ = ఒంటిబట్టగట్టినవానిని, అతిమనోహరుఁ = మిక్కిలిఅందమైనవానిని; అన్వేషించుచుఁ = వెదకుచు, సైరంధ్రీవ్రతంబుఁ=సరికత్తెవలె ఆభరణములు మొదలగునవి లేకుండుట. యను నియమమును. చేకొని= పూని; వియోగఅనలంబునఁ=పతివిరహమనెడి యగ్నితాఁకుడుచేత, కందికమాడి; కందమూలఫలంబులుఅ = గడ్డలు; దుంపలు; పండ్లుమాత్రమే; ఆహారంబుగాఁ=ఆహారము కాఁగా; ప్రొద్దుపడినచోటుఅ = అస్తమయమైనతావే; నివాసంబుగాఁ = ఉనికిపట్టుకాఁగా; మృగంబులుఅ = అడవిజంతువులే, సహాయంబు కాఁ = తోడు కాఁగా, వనంబునఁ=అడవియందు, పరిభ్రమించెదను = తిరిగెదను. అని; బాష్పజలంబులఁ = కన్నీళ్ళచేత; ఉరస్థలపాంసుబు - ఱొమ్మునంటుకబడిన దుమ్మును, పంకంబుచేయుచుఁ= బురదయగు

నట్లు చేయుచు, పలుకక; ఉన్నన్; ఆదమయంతికిన్; రాజమాత, ఇట్లు; అ యెన్.

118. ఇందీవరదళనేత్ర = నల్లగలువలంబోలు కన్నులు గలదానా, నీవు; నాకడన్=నాదగ్గిర, ఉండుము,(నేను)నీపతిని;గోయంగన్=వెదకుటకు; భూదేవఉత్తములన్ = బ్రాహ్మణశ్రేష్ఠులను, పంచెదను =పంపెదను, నావు డున్=అనిచెప్పఁగా; భీమనందన=దమయంతి, నెమ్మిన్=ప్రేమతో, ఇట్లు; అనియెన్.

119. ఏను; సైరంధ్రీవ్రతంబు; చేకొని యుండెదను = పూనియుండె దను. ఉచ్ఛిష్టంబు=ఎంగిలి, భుజింపను = తినను; పదధావనంబుచేయను = (పరపురుషుల) కాళ్ళుకడుగను. పరపురుషులతోన్; పలుకనోపను = మాట లాడఁజాలను. పతిన్=భర్తను; అన్వేషించుచోం బైన్ = వెదకునిమిత్తమై; అరిగెడుబ్రాహ్మణులతోన్, పలుకుదును. అట్లు ఐనన్ = నీవీమాటలకొప్పు కొంటివేని; నీయొద్దన్; ఉండుదును. ఒండువిధంబు ఐనన్ = వేఱువిధముగా నున్నను; ఉండ నేరను=(నీకడ)ఉండఁజాలను. అనినన్, రాజమాతసంతసిల్లి, నీకున్; ఇష్టంబు ఐనవిధంబునన్అ = ఇచ్చవచ్చువనే; నాయొద్దన్ అ= నా దగ్గిరనేఉండుము.అని, దానిన్=ఆదమయంతిని, అతిగౌరవంబునన్= ఎక్కుడు మర్యాదతో; చేకొనియుండన్ = ఉంచుకొనుటకు; తనకూఁతున్, సునంద యగుదానిన్, సునంద యనుపేరుగల తనకూఁతును; సహయింపించినన్ = సహా యముగా నియ్యఁగా.

120. నలుదేవి = నలునిపట్టపుదేవియగు దమయంతి, చైద్యేశుపురిన్= సుబాహుని పట్టణంబునందు, ఎదన్ = మనస్సునందు, పతిన్ = భర్తను, తలఁచుచున్, దుస్స...ర్ధితఐ-దుస్సహ=ఓర్వరాని, వియోగ =ఎడఁబాటువలని, తాప=వేడిమిచేత, అర్దితఐ = కనులినదై, అలయక = శ్రమచెందక; పుణ్య వ్రతములు=మేలుగావించెడినోములు, సలుపుచున్ = చేయుచు, సైరంధ్రి అనఁగన్ = సైరంధ్రియను పేరుతో, ఉండెను.

121. అటన్ = అరణ్యములో. నలుఁడు; దమయంతిని, పాసి; దారుణ అరణ్యములోన్ = భీకరమైన యడవిలో; అరుగువాఁడు = పోవుచు; ముందటన్ = ఎదుట. (వై. ప. అ.)

122. దవదహనంబు = కార్చిచ్చు; అవిరళవిస్ఫులింగ నివహంబులన్ = దట్టములైన మిణుఁగురుల రాసులచేత; అభ్రపథంబున్ = ఆకాశమార్గమున, అంటుచున్ = తాఁకుచు; ఉదగ్రతరుదాహము చేయుచు ఉన్నన్ = ఎత్తైన చెట్లను గాల్చుచుండఁగా, మానవపతి = నలుఁడు; దానియంతరమునన్ = అ మంటనడుమ; నరనాథ = ఓరాజా; నన్నున్, గారవమునన్ = ప్రీతితో; వేగ = త్వరగా; కావన్ = రక్షించుటకు; ఇటన్ = ఇచ్చటికి; రమ్ము, అను, ఆర్తమహా నినాదమున్ = నొచ్చిన గొప్పధ్వనిని. (వై ప. అ.)

123. విని = ఆలకించి, శంకింపక = సందేహింపక, చెచ్చెరన్ = వేగము గా, అనఘుఁడు = పాపరహితుఁడైననలుఁడు; అతిఉదగ్రదవానలమధ్యంబునకున్ -అతి = మిక్కిలి; ఉదగ్ర = హెచ్చిన, దవానల = కార్చిచ్చుయొక్క, మధ్యంబు నకున్ = నడుమునకు, అరిగి, దీనఆననున్ = దేవురింపుమోముగలవానిని, కుండలితఅంగున్ — చుట్టచుట్టుకొనినశరీరముగలవానిని, ఒక్క నాగకుమారున్ = ఒక్క చిన్నపామును, కనియెన్.

124. ఆనాగకుమారుఁడు = ఆపాఁపకూన, కృతఅంజలి ఐ = చేతులుఁగట్టు కొన్నవాఁడై, ఏను, కర్కోటకుండు అనువాఁడను, కర్మవశంబునన్ = పాప కర్మవశముచేత, ఒక బ్రహ్మఋషిన్ = ఒక బ్రాహ్మణుఁడయి ఋషియైనవానిని; ఉల్లంఘించి మీఱి, తత్ శాపంబునన్ = అనుని శాపంబువలన, ఏకడన్ = ఎచ్చోటికిని, కదలన్ - నేరక - కదలఁజాలక, ఉన్నవాఁడను.

125. నాలుగువెసలన్ = నలుదిక్కులను, దావజ్వాలఆవళి = కార్చిచ్చు మంటలయొక్క గుంపు, కవిసెను = ముట్టికొనెను. మండి; చాన్ = చావను. ఓపన్ = చాలను. మహీపాలక = ఓరాజా, నన్ను, ఒకసరసీకూలమునన్ = ఒక చెఱువు గట్టును; చేరంగన్ = చేసుకొని, ప్రయమున్ — ప్రేమతో, ఎత్తికొనిపొమ్ము.

180. ఇట్లు, ఋతుపర్ణునొద్దన్, అశ్వ అధ్యక్షుఁడై=గుఱ్ఱముల విచారణాధికారియై; దుష్టఅశ్వంబులన్= చెడ్డగుఱ్ఱములను, వశగతంబులన్ చేయుచున్ = లోఁబఱచుకొనుచు, అశ్వవరంబులన్=మేటిగుఱ్ఱములను, ఆరోహణంబులన్=సవారులకు; శిక్షించుచున్ = నేర్పుచు; రసవంతంబుగన్= రుచికలిగియుండునట్లు; అన్నసంస్కారంబు-చేయుచున్ =వంటవార్పులు చేయుచు; ఋతుపర్ణనియుక్తులు=ఋతుపర్ణమహారాజుచే నేర్పఱుపబడినవారు; అయిన, వార్ష్ణేయజీవలులు=ఆపేరుగలవారు; తనకున్; సహాయులు కాన్ = తోడై యుండఁగా; ప్రచ్ఛన్నుండై ఉండి = దాగియుండి; ఒక్కనాఁడు, ఏకాంతమునన్ = ఒంటరిగా; దమయంతిన్; తలపోసి = తలంచుకొని; తనరాకన్ =తానువిడిచివచ్చుటను; తలఁచి=ఎంచుకొని. (పై ప. అ.)

131. ఇభరాజగమన=మేటిఏనుఁగువంటి నడకగలదానా; నీవు; ఎందులకున్; అరిగితివి; ఉడురాజవదన = చంద్రబింబమువంటిముఖము గలదానా; ఎందున్; ఉన్నదానవు. అబల = ఓచిన్నదానా; అడవులలోన్ = వనములయందు; ఎవ్వరిచేతన్; పట్టుపడితి=చిక్కికొంటివి. అశనాపేక్షన్=ఎరమీఁది కోరికతో. పఱచుచున్న ఉగ్రమృగంబుల ఉదరంబులోన్=పరుగెత్తుచుండు భయంకరమృగంబుల కడుపులోపల, ఉన్నదానవే=ఉన్నావా? నీతల్లిదండ్రులకడన్; ధృతిన్=ధైర్యముతో, ఉన్నదానవే. దేశాంతరంబులన్= ఇతరదేశములందు; ఉన్నదానవే=ఉన్నావా. అంచున్= అనిచెప్పుచు; నలుఁడు; శోకము; ఉత్కటముగాన్=హెచ్చఁగా; ఉదిత...త్ముఁడై-ఉదిత=హెచ్చిన; మదన= మన్మథబాధచేత. విమోహిత=మైమఱపు కలిగిన, ఆత్ముఁడై=మనస్సుగలవాఁడయి; హృదయ ఈశ్వరిన్=దమయంతిని; తలఁచి; రాత్రియెల్లన్ = రాత్రియంతయు; తాపమునను=మన్మథసంతాపముచే; నిద్ర; లేక; నంది = వాడిపోయి; నిట్టూర్పులు; ఊర్చుచు=విడుచుచు; ఉండెను.

132. అతని ప్రలాపంబు=ఆతనివదరుటను; విని; జీవలుఁడు; ఆత్మగతంబునన్ = తనమనస్సులోపల.

133 ఇతఁడు = ఈబాహుకుఁడు, అఱపొఱడుఁగ = సగముగూనును, కుఱుచచేతులును = పొట్టిచేతులును, ఒఱశరీరమును = వంకరశరీరముగలిగి; ఒరులకుఁ = ఇతరులకు, చూడఁగ కొఱకాక ఉండియుఁ = చూచుట కసహ్యుఁడుఁగా నున్నను, యువతిప్రియుఁడు ఐ = వయసు చిన్నదాని కిష్టుఁడై, మన్మథునొఱపులఁ=మన్మథబాధలయందు, పడియెడుఁ = చిక్కియున్నాఁడు.

134. వీనిచేతఁ, వరియింపఁబడియెడు వనిత = కోరఁబడుసుందరి, వీనికంటెఁ, లెస్స=అందమయినది, కాకఉన్నె=కాకుండునా, అనుచుఁ, బాహుకునొద్దకుఁ, వచ్చి, నీతలఁచుచున్న భార్యకుఁ =నీవుస్మరించెడిభార్యకును, నీకుఁ, ఏల, వియోగంబు=ఎడఁబాయుట, అయ్యెను=కలిగెను. అని, అడిగినఁ, బాహుకుండు, ఇట్లు, అనియెఁ.

135. నన్నుఁ, చూచి నగరు ఎ=(జనులు) నవ్వరా? నలినఅక్షి = కమలనేత్రయగు సుందరి, నాకుఁ, ఏల, =ఎందుకు, విప్రయోగము= ఎడఁబాయుట, ఏల వినవే. (వినుము-ఏ) = వినుమయ్యా, ఏలఒ = ఎందుకో, నేను, ఎఱుఁగను. తొల్లి=పూర్వము, మందప్రజ్ఞుఁడు (మూఢబుద్ధిగలవాఁడు), అను ఘటుండు=అనుబంటు, తనలతాంగిఁ = తనప్రియురాలిని, పాసి,

136. దానిఁ; అన్వేషించి=వెదకి, ఎందును = ఎచ్చటను; కానక, ప్రలాపించినఁ=విలపింపఁగా,తత్ప్రకారంబు=అవిధముగా,ఏను,అనుకరించితిని= నటించితిని. అని, చెప్పి, ఇట్లు అయోధ్యాపురమునఁ = అయోధ్యాపట్టణమునందు, బాహుకనామంబుతోఁ = బాహుకుండనెడిపేరుతో, ప్రచ్ఛన్నుఁడు ఐ =మఱఁగినవాఁడై, నలుఁడు, ఉండెను. అంతఁ = తర్వాత; అటుఁ = అచ్చట, విదర్భఈశ్వరుఁడు = విదర్భరాజగుభీముఁడు, నలురాజ్యభ్రంశంబు = నలునిరాజ్యముకోల్పోకను, విని, కూతురును, అల్లుడును, ఎటుఁ=ఎచ్చటికి, పోయిరో; ఎట్లు; ఉన్నవారో; అని; శోకించి=విలపించి.

137. అపారబలుఁడు=అంతులేని బలముగలవాఁడు, (భీముఁడు,) సదాచారులన్ = మంచియాచారముకలవారిని, విద్వాంసులన్ = అన్నిటిని దెలిసినవారిని, ఇష్టులు ఐన బ్రాహ్మణులను=తనయందుఁ బ్రేమగల విప్రులను, సత్కారంబులన్=మర్యాదలచే; తనిపి=తృప్తిపొందించి, వారిన్=బ్రాహ్మణులను, కడునెయ్యముతోన్ = ఎక్కువసంతోషముతో; వారలన్ = ఆ నలదమయంతులను; రోయఁగన్=వెదకుటకై, పంచెన్=పంపెను.

138. మఱియు, నలదమయంతులు; ఉన్నచోటు; ఎఱింగి; వచ్చిన వారికిన్, వేయిగద్యాణములు=వేయివరహాలు, ఇత్తును అనియును, వారలన్; తోడ్కొని=పిల్చుకొని; వచ్చువారికిన్; గోసహస్రంబులు = పెక్కుగోవులను; అగ్రహారంబులును = మంచిగ్రామములును, ఇత్తును అనియు, పలికి, పంచినన్=పంపఁగా.

139. జగతీదేవతఉత్తములు=బ్రాహ్మణశ్రేష్ఠులగువారు, సఖిలదేశములకున్=అన్నిదేశములకును; వడిన్ = శీఘ్రముగా. అరిగి, జగతీచక్రమునన్= భూమండలమునందు, కల=ఉన్న, నగర...ణంబులు-నగర = పట్టణములు, మహాగ్రామ=గొప్పయూళ్లు, పక్కణంబులు=పల్లెలు, కలయన్=అంతటను, ఇమ్ముగన్=చక్కఁగా, రోసిరి=వెదకిరి.

140. అందున్=వారిలో, సుదేవుండు, అనుబ్రాహ్మణుండు, చేదిపతి=చేదిదేశపురాజు, ఐనసుబాహుపురంబునకున్; చని; పుణ్యాహవాచనంబు=ఇంటియశుచిత్వము పోవుటకై చేయు నొక కర్మవిశేషమును, చేయింపఁబోవు బ్రాహ్మణులతోన్; రాజగృహంబు = రాచనగరు, చొచ్చి అంతఃపురమునన్; సునందానసహితఐ = సునందతోగూడినదై; ఉన్నదానిన్ =ఉన్నదియు; ధూళిధూసర ఐ= దుమ్ముచేఁ గప్పబడినదై; ధూమ... బద్ధఐన-ధూమ = పొగయొక్క, జాల = సమూహముచేత, నిబద్ధ ఐన = క్రమ్మఁబడినదియగు, అగ్నిప్రభయు పోలెన్ = నిప్పుమంటవలెను, నీల...తంబుఐన-నీల=నల్లని; అభ్ర=మేఘములచేత, సంవృతంబు అయిన =

కప్పఁబడినదియగు, చంద్రరేఖవలెను, బహు...నిమగ్నఐన-బహు = విస్తారమైన, పంక=బురదయందు; నిమగ్నఐన=మునిఁగిన, మృణాళియున్‌పోలెన్=తామరతూఁడువలెను, ఏర్పడక ఉన్నను=స్పష్టముగాఁ దెలియకున్నను, తదీయ...తంబు ఐన-తదీయ=దానివగు; భ్రూ=కనుబొమ్మల; యుగ=జంటయొక్క, మధ్య=నడుమ, గతంబు అయిన=ఉన్నట్టి, సూక్ష్మలక్షణంబు=సన్ననిమచ్చను; ఇమ్ముగాన్=బాగుగా; నిరీక్షించి=చూచి; దమయంతిగన్-ఎఱింగి; ఇది, పతివియుక్తయై=భర్తనుయెడబాసి; శుష్క్రప్రవాహంబుఐన=ఎండిపోయి ఉదకములేని; నదియునున్‌పోలెన్=ఏటివలెను, శూన్యకమలంబు = తామరపువ్వులులేని; నళినియున్-పోలెన్=తామరతీఁగవలె; ఒప్పకుండియున్ = ప్రకాశింపకుండినను, తనపతివ్రతాత్వంబునన్=తనపాతివ్రత్యముచేత; ఒప్పుచున్నది = ప్రకాశించుచున్నది.

141. భామలకున్=స్త్రీలకు; పతిభక్తి అ=మగనియందుఁ బ్రేమయె; అనపహార్యంబు = శత్రువులచే దొంగిలింపరానిదియు, తేజోమయంబున్ = కాంతిస్వరూపమైనదియు, సర్వగుణంబులకున్=సమస్తసుగుణములకును, గురుతరంబు=మిక్కిలిముఖ్యమైన; అలంకారంబు=సొమ్ము, పరమము ఐన=గొప్ప దైవభూషణము, వెఱభూషణములు=తక్కిన సొమ్ములు, ఇట్టివే=ఈలాగుండునవియా. (కావనుట)

142. రోహిణికిన్= రోహిణిదేవతకు, చంద్రసమాగమంబునుంబోలెన్=చంద్రునితోఁ గూడికవలె, దీనికిన్, భర్తృసమాగమంబు = పెనిమిటితోడి కూడిక, ఎన్నఁడున్; అయ్యెడునో=కలుగనున్నదో, తుల్య...జాత్యులు—తుల్య=సమానమైన, శీల = మంచినడవడి, వయః=ఈడు; రూప = ఆకారము, అభిజాత్యులు = సత్కులంబునఁ బుట్టుక యనునవి గలవారలు, ఐన సలదిషయంతులు. ఒక్కటన్=ఒక్కచోట; ఉండన్=ఉండఁగా, చూచి, విదర్భేశ్వరుఁడు=భీముఁడు, ఎన్నండు; కృతార్థుఁడు=తానుకోరినకోరికను పూర్తిచేసికొన్నవాఁడు, అయ్యెడున్ ఓ=కాఁగలఁడో; అంచున్; అల్లన్-అ= మెల్లగా; ఇ[illegible], అ[illegible]యె.

143. అవ్వ=అమ్మా; నీ తల్లిదండ్రులకున్; ఆత్మజులకున్=బిడ్డలకు, బంధుజనులకున్=చుటములకును, కుశలంబుల=క్షేమమే; భామ=ఓసుందరీ, వారు; నీదుకుశలము=నీక్షేమము, ఎఱుఁగునంతకున్=తెలియువరకు, వగన్ కూరి=విచారంబునొంది, వగచుచున్నవారు = దుఃఖపడుచున్నారు. ఇంకను, వారలవంత=వారిదుఃఖము; ఉడుగును=తీరును.

144. దేవీ = ఓరాణి; ఏను, భవత్ భ్రాతృసఖుండను = నీయన్నకు మిత్రుఁడను, సుదేవుండు; అను బ్రాహ్మణుఁడు. విదర్భఈశ్వరుఁడు = విదర్భరాజు (నీతండ్రి). నీయున్నచోటు=నీవున్నతావు; ఎఱుంగన్; పెక్కండ్రు=అనేకులను; బ్రాహ్మణులను, పుచ్చినన్=పంపఁగా; నేను, ఇందులకున్=ఈపురంబునకు, వచ్చి, నాపుణ్యమునన్ = నాయదృష్టవశంబున నిన్నున్, కంటిని, అనినన్; దమయంతి, వానిన్=ఆసుదేవుని, ఎఱిఁగి = గుఱుతించి తనతలిదండ్రులన్; బాంధవులన్; ప్రత్యేకంబు అ = వేర్వేఱుగా, (కుశలంబు=క్షేమము) అడిగి, అశ్రుజలంబులు = కన్నీరు, ఉరులన్ = కాఱుచుండఁగా, ఏడ్చుచున్నన్, చూచి, ఏలకో (ఏల ఓ)=ఎందుకో, ఇప్పుడు, సైరంధ్రి, ఏడ్చుచున్న యది, అని; సునంద, రాజమాతకున్; చెప్పిపుచ్చినన్ = చెప్పి పంపఁగా.

145. వారిజదళలోచన = తామరరేకులవంటి కన్నులు గలదగు; రాజమాత=రాజుగారితల్లి; వనితానివహంబుతోడన్ = స్త్రీలగుంపుతోగూడ; అంతిపురంబునన్=అంతఃపురంబునందు, ఉన్న; నృపనందన అగు = రాజపుత్రియగు; దమయంతికడకున్; తద్దయున్ =మిక్కిలి, వేడ్కన్ = ఉత్సాహముతో; చనుదెంచెను.

146. ఇట్లువచ్చి; తమలోన్=వారిలోలోపల, మాటాడుచున్న బ్రాహ్మణునిన్; దమయంతిన్, చూచి; రాజమాత; ఇట్లు అనియెను. అయ్యా=ఓబ్రాహ్మణుఁడా; ఇది; ఎవ్వనికూఁతురు, ఎవ్వనిభార్య; ఏమికారణంబునన్=ఏహేతువుచేత; తనభర్తను; బాంధవులను; పాసి; పుణ్యవ్రతంబులు = పుణ్యప్రదము

లైననోములు, సలుపుచున్నయది = చేయుచున్నది. దీనిని; నీవు; ఎట్లు ఎఱింగితివి, ఈకోమలినామంబు=ఈచిన్నదానిపేరు, ఏమి, అని, అడిగినన్, సుదేవుండు, ఇట్లు, అంయెన్.

147. నళినఅక్షి = తామరరేకులఁబోలుకన్నులంగల యోరాజమాతా, ఇది; విదర్భఈశుతనయ=విదర్భరాజు కూఁతురు; పుణ్యశ్లోకుఁడు = పవిత్రమైన కీర్తిగలవాఁడు; ఐన; నలుదేవి=నలునిరాణియగు; దమయంతి సుమ్ము = దమయంతికదా. విధికారణంబునన్ = దైవముయొక్క యాగ్రహంబువలన, నిజనాథుఁడు = తనపెనిమిటి; రాజ్యచలితుఁడు ఐ= రాజ్యమునుండి భ్రష్టుఁడయి, అరుగన్=పోఁగా; తోడనే=వెంటనే; చనెను. అను; వార్త=వృత్తాంతము; వెలయంగన్=బాగుగా; విని, భూవిభుఁడు=విదర్భరాజు; బ్రాహ్మణులను; వారిని; రోయన్=వెదకుటకై, పంపెను.

148. ఏను; ఇందులకున్ = ఇచ్చటికి వచ్చి; మీచేతన్; సురక్షితఐ ఉన్న ఈ కోమలిన్=చక్కఁగా సంరక్షింపఁబడుచున్న యీసుకుమారిని, చూచి; దీని భ్రూమధ్యంబునన్ = దీనియొక్క కనుబొమలనడుమ పద్మనిభంబై=కమలంబుఁబోలినదై; విభూతి అర్థంబుగాన్ = ఐశ్వర్యముకొఱకు; విధాతృనిర్మితంబున్ = బ్రహ్మచేఁజేయఁబడినది; ఐనపుణ్యలక్షణంబు = శుభచిహ్నము; పాంసుపటలచ్ఛన్నంబుఐ ఉన్నన్=దుమ్మయొక్కరాశిచేఁ గప్పఁబడినదియై యుండఁగా, ఉపలక్షించి = చూచి; రాజపుత్త్రిన్ కాన్ = దమయంతినిగా, ఎఱిఁగితిని; అనినన్; సునంద; శుద్ధఉదకములన్ = లేటనీటితో; దాని భ్రూమధ్యంబున్=దాని కనుబొమలు నడుమను, కడిగినన్ = కడుగఁగా, అది; విస్పష్టంబు అగుటన్ = స్పష్టముగాఁ దెలియఁగా; అందఱును; ఆశ్చర్యము నొందిరి. అంతన్ = పిమ్మట.

149. రాజమాత = రాజుగారితల్లి, ఆనందభరిత ఆత్మ ఐ = సంతోషముతోనిండిన మనస్సుతోఁ గూడికొనినదై; ఆకమలాక్షిన్ = ఆదమయంతిని; ప్రీతితోన్ = గారాబముతో, కౌఁగిలించికొని, తన్వి = ఓచిన్నదానా, నీవు, ఏనున్, నిజజననియున్ = నీతల్లియును, పేర్మిన్, దశార్ణ మహారాజు

గుమాస్తైలము. అదియుఁ = నీతల్లియు, విదర్భఈశుపతి = భీమునిపట్టపుదేవి, అయ్యెను. నేను, వీరబాహునకుఁ; ఇంతిని ఐతిని. అనినన్ = అని చెప్పఁగా; ఆఅన్వకుఁ=ఆరాజమాతకు; అతివినయంబుతోఁ = ఎక్కువఅడఁకువతో; నలుదేవి=దమయంతి; మ్రొక్కి; సునందను; ఎత్తికొని=కొంతసేపు తనయొడిలోఁ గూర్చుండఁబెట్టుకొని; కరంబు=మిక్కిలి, నెమ్మిన్=ప్రేమతో; కొన్ని దినంబులు, అందుఁ = ఆచేదీశునిపురంబున, ఉండి, ఒక్కనాఁడు, ఇట్లను అనియెఁ; దేవి=ఓతల్లీ; ఇదియుఁ=ఈపురంబును; అదియుఁ = ఆవిదర్భా పురంబును, ధృతిఁ = సంతోషకరంబులైన, నాకుఁ; పుట్టినయిండ్లు అ= పుట్టినిండ్లే; ఇందుఁ అందుఁ = ఇచ్చటను అచ్చటను; కడుఁ = మిక్కిలి, సుఖంబు అ=సుఖమే; (కలదు) ఎక్కడనున్నను నొక్కటియనియే యని తాత్పర్యము.

150. అయిననుఁ=అట్లొక్కటియైనను; తల్లిదండ్రులను; అనుజులఁ = తమ్ములను; ఆత్మజులఁ=బిడ్డలను; చూచెడువేడ్క = చూడఁగోరిక; ఉల్లంబునఁ=మనసున పుట్టినయది. విదర్భకు; పోయెదను. అనతిమ్ము=సెలవొసంగుము. అని; కృతఅంజలి=దోసిలి కట్టినది. అయిన దమయంతిఁ; అతిస్నేహంబునఁ=ఎక్కువచెలిమితో, సుతప్రేషితబలంబుతోఁ—సుత = కొడుకుచే; ప్రేషిత=పంపఁబడిన; బలంబుతోఁ=సేనతో; స్వర్ణరత్నయానంబునఁ =బంగారుతోఁజేసిన రత్నములుచెక్కిన పల్లకియందు, ఉనిచి పుచ్చినఁ = కూర్చుండఁబెట్టి పంపఁగా.

151. భామ = దమయంతి; విదర్భకుఁ, ఏఁగి; తనబంధుజనంబుల యొద్దఁ, ఉండియు; కోమలదేహ సౌఖ్యములకుఁ = సున్నితములైన శరీర సుఖములకు; వెలియై = దూరురాలై; మలిన అర్ధవస్త్రముఁ= మురికిగలదైన సగముబట్టయును, భూమిరజంబు=నేలదుమ్ము; అంగమునఁ = శరీరమునందు, పొల్పగుచుండఁ=అందము గల్గించుచుండఁగా; జీవితస్వామిఁ = తనప్రాణనాథుఁడయిన; నిజఈశుఁ = తనప్రియుని; చూచుదివసంబులు=చూచుదినం

బులు, కోరుచున్ = (ఎన్నఁడువచ్చునాయని) యెదురుచూచుచు, సువ్రతంబుతోన్ = మిక్కిలినిష్ఠతో; ఉండెను.

152. ఇట్లు భర్తృవియోగ ఆతుర ఐన = పెనిమిటి యెడఁబాటుచే నొచ్చినదైన; దమయంతి; ప్రాణంబు; ధరియింపన్ ఓపక = నిల్పుకొనఁజాలక, ఒక్కనాఁడు; ఏకాంతంబునన్; తనజననికిన్=తనతల్లికి; ఇట్లు; అనియెను.

153. శుభచరితున్=మంచిప్రవర్తనగలవానిని; శోకఅపనోదిన్ = దుఃఖముపోఁగొట్టువానిని; పుణ్యశ్లోకున్ = పవిత్రమైనకీర్తిగలవానిని; నలునిన్; గోయన్ = వెదకుటకు; పనుపుము=అనతిమ్ము. తత్ ఆలోకనవిహీనను ఐ= ఆనలుని చూచుటలేనిదాననై; లోకంబు ఎఱుఁగన్ = జనులకందఱికిఁ దెలియునట్లు; పరలోకకృత ఆవాసను = పరలోకంబున నివాసముఁగలుగజేసికొన్నదానను; అగుదును. (ప్రాణములను బాసెదను.అని తా.)

154. అనినన్; అదియున్ = ఆదమయంతియొక్క తల్లియు; కూఁతునభిప్రాయంబు=కుమార్తెయొక్క కోరికను; భీమునకున్=తనభర్తకు, ఎఱింగించినన్. అతఁడు; నలుమార్గణంబునన్=నలమహారాజును వెదకుటకై, ఋజుమార్గులు=చక్కనిదారియందుఁబోవువారు; ఐన బ్రాహ్మణులను; నియోగించినన్ —ఉత్తరువుచేయఁగా, తనపతిన్; అన్వేషింపన్=వెదకుటకు; అరుగుబ్రాహ్మణులకున్; ఇట్లు; అనియెన్.

155. నైషధఈశ్వరుఁడు=నిషధదేశమునకురాజగు, నలుఁడు, ఇప్పుడు, అసమర్థుఁడు అగుటన్ చేసి = శక్తిచాలనివాఁడు గనుక; తన్నున్, ఇతరులు; ఎఱుంగక, ఉండున్ = తెలియకుండును. కానన్ = కాఁబట్టి; మీరు, ఉరుసభాఅంతరములకున్—ఉరు = గొప్పలైన; సభా = రాజులకొలువుకూటములయొక్క, అంతరములకున్ = నడిమిప్రదేశములకు; అరిగి = పోయి; ఇట్టులు = ఈరీతి; అనుఁడు = చెప్పుఁడు.

156, నీవు; సత్యనిత్యుఁడవు = సత్యముపల్కుటయే నిత్యవ్రతంబుగాఁగలవాఁడవు, సతిన్ = పతివ్రతయగు, ఇంతిన్ = భార్యను, వర్జించి = వదలిపెట్టి, దానివస్త్రఅర్ధంబున్ = దానియొక్కచీరలో సగముభాగము, తఱిగి=

చించుకొని, పరిధానముగన్ = కట్టువస్త్రముగా, చేసి, పోవంగన్ = పోవుట, పాడియే = తగునా, భార్య = కాపాడఁదగినది, భర్త = కాపాడువాఁడు; అను ధర్మము అది = అనుప్రసిద్ధమైనన్యాయము. నీయందున్ = నీవిషయమున, మిథ్య = అబద్ధము, అయ్యెను. నీవున్ = నీవు; ఇట్టి, నిర్దయబుద్ధి = కనికరములేని తనము, చేసికొనఁదగును ఏ = అవలంబింపవచ్చునా? అట్టిసాధ్వికిన్ = అట్టిపతివ్రతయందు, (సప్తమ్యర్థకషష్ఠీ.) కరుణాప్రసన్నుండవు = దయచేననుగ్రహము పొందినవాఁడవు, అగుము. అని; ఎల్లచోన్ = అన్నిప్రదేశములలోను, పలికినన్ = చెప్పినట్లయితే, ఎవ్వఁడు ఏని = ఏపురుషుఁడైనను; పలుకున్ = మీరన్నమాటను; పడఁగన్ ఓడి = పడఁజాలక; ప్రతివచనంబు = బదులుమాటను, ఇచ్చునో, అతఁడు నలుఁడుగాఁగన్ = నలుఁడని తెలిసికొని; ననున్, అతనికిన్, ఎఱింగించి, తోడ్కొనిరండు = వెంటబెట్టుకొనిరండు, రాని నాఁడు = రానిపక్షమున, ఎఱిఁగి = (అతని సంగతి) తెలిసికొని, రండు.

157. అని; పంచినన్ = పంపఁగా; పనిపూని = ప్రయత్నముతో; బ్రాహ్మణులు; దమయంతి; కఱపినపలుకులు ఎల్లన్ = నేర్పినమాటలన్నింటిని; సకలదేశసభలన్ = అన్ని దేశముల రాజులకొలువుకూటములందు; పలికి, ఎందునున్ = ఎచ్చటను, కానకవచ్చిరి = చూడకవచ్చిరి. అందున్ = ఆ వెదుకపోయిన బ్రాహ్మణులలో; పర్ణాదుఁడు అను బ్రాహ్మణుఁడు, దమయంతికిన్; ఇట్లు; అనియెను. నేను అయోధ్యకున్; అరిగి; నీకఱపినపలుకులు ఎల్లన్ = నీవు నేర్పినమాటలన్నింటిని; ఋతుపర్ణసభన్ = ఋతుపర్ణునికొల్వుకూటంబునందు; పలికినన్ = మాటలాడఁగా; ఒక్కపురుషుఁడు; కుఱుచచేతులుగలవాఁడు = పొట్టిచేతులుగలవాఁడు, ఋతుపర్ణునొద్దన్, నూఱుగద్యాణంబుల జీవితంబు వాఁడు = నూఱువరహాలజీతమునకు కొల్వుకొల్చువాఁడు, శీఘ్రయానకుశలుండు - శీఘ్ర = తొందరగా, యాన = గుఱ్ఱములనునడుపుటయందు, కుశలుండు = నేర్పరి, సూపక్రియా = వంటచేయుటయందు, నిపుణుఁడు = నేర్పరి. విరూప అంగుండు = రోఁతపడఁదగిన రూపంబు గలవాఁడు. బాహుకుఁడు అను అశ్వశిక్షకుఁడు = బాహుకుఁడను పేరుగల గుఱ్ఱ

ములకు నడకలను నేర్పువాఁడు, విని, నన్నున్; ఏకాంతంబునన్ = రహస్యస్థలంబునకు, పిలిచి, వెలవెలన్ అగుచు=ముఖమునకాంతిలేనివాఁడగుచు, దీర్ఘనిశ్వాసపురస్సరంబుగాన్=పెద్దదైననిట్టూర్పుతోఁగూడ, ఇట్లు=అనియెన్.

158. పురుషునందున్ =భర్తయందు,దోషపుంజంబు=పెక్కుదోషములు, కలిగినన్ =ఉన్నను,ఎఱిఁగి=తెలివిగలదై,భార్య=పెండ్లాము, ఎదన్=మనస్సునందు; సహించున్ ఏని=ఓర్చుకొన్నయెడల, పురుషులందున్; అభీష్టభోగంబు = కోరినకోరికల ననుభవించుటయు,దేహాంతరంబునన్=దేహము వదలినప్పుడు; ధర్మరతియున్= మోక్షమందాసక్తియు;పడయున్=పొందును.

159. అని, ఒండు ఎద్దియున్=ఇతరమేమియు;పలుకక ;తననివాసంబునకున్=తనయునికిపట్టునకు; పోయెను. అని; చెప్పినన్=చెప్పఁగా, విని, పెద్దయున్ ప్రొద్దు=చాలకాలము; చింతించి, నలుఁడు కానివాఁడు=నలుఁడుకానిపక్షమున, ప్రతివచనంబు=బదులుమాట, ఏల, ఇచ్చును. ఇంకను; వలను కలవారలన్ = ఉపాయశాలురను, పంచి=పంపి, ఆతనిన్ = ఆనలమహారాజును గూర్చి;ఇమ్ముగాన్=బాగుగా;ఎఱుఁగన్వలయును.అని;జననీజనకులయనుమతంబునన్ = తల్లిదండ్రులయంగీకారముమీఁద; సుదేవున్; రావించి = పిలిపించి, వానికిన్, ఇట్లు; అనియెన్.

160. నన్నున్; ఎఱిఁగి=గుర్తుపట్టి, తెచ్చినట్లు అ=తెచ్చినచందమున నే; జగన్నుతున్=లోకములచేఁ గొనియాడఁబడిన, నలున్, కౌశలంబునన్ = నేర్పుతో, ఎఱిఁగి; తెమ్ము=తోడ్కొనిరమ్ము. విద్వన్నాథ = పండితులలో శ్రేష్ఠుఁడా; ఎందున్ = ఎచ్చటను; పరికింపఁగన్ = విచారింపఁగా, నీవు అ= నీవె; సర్వగుణసంపన్నుఁడవు = సమస్తసుగుణములతోనిండినవాఁడవు, (నీవు తప్ప వేఱొక్కరీపనిని జేయఁజాలరు.)

161. దేశాంతరవిప్రుఁడవు ఐ = ఇక్కడనుండి వచ్చినవాఁడవనికాక (పొరుగూరిబ్రాహ్మణుఁడ ననువ్యాజముతో); అయోధ్యకున్,అరుగుము. రవి

ప్రతాపఉన్నతుఁ౽-రవి = సూర్యునియొక్క, ప్రతాప = వేఁడిమివంటివేఁడిమిచేత; ఉన్నతుఁ౽=మీఱినవానిని, అనఘుఁ౽=దోషములేనివానిని; అమరసముఁ౽=దేవతలతో సమానుని; ఉత్తరకోశలఈశుఁ౽= ఉత్తరకోసలదేశమునకు ప్రభువగువానిని, భాంగాసరినిఁ౽=భంగాసురునికుమారుని, ఋతుపర్ణునిఁ౽, కనుము=చూడుము.

162. మఱియు, విదర్భావిభుఁడుఅగు = విదర్భదేశపురాజగుభీముఁడు; నలుఁ౽, రోయఁ౽=వెదకుటకు; పంచి=ఆనతిచ్చి, ఎందును, కానక,దమయంతికిఁ౽; ద్వితీయస్వయంవరంబు=రెండవస్వయంవరము; రచియింపఁ౽=చేయుటకు; పూనినఁ౽ = ప్రయత్నపడఁగా, అందులకుఁ౽ = ఆస్వయంవరమునకు, భూవలయంబునఁ౽ = భూమండలమందు; కలరాజులు, ఎల్లను,పోయెదరు. అని; అతిత్వరితంబుగాఁ౽ = మిక్కిలితొందరపాటుతో; చెప్పుము. అని, పంచినఁ౽ = చెప్పగా, సుదేవుఁడు, అయోధ్యాపురంబునకుఁ౽, పోయి,ఋతుపర్ణుఁ౽, కాంచి, విదర్భాపురంబునఁ౽=దమయంతీ ద్వితీయస్వయంవరంబు; ఎల్లి=రేపు అయ్యెడుఁ౽=జరుగును. అని; చెప్పినఁ౽; విని; ఋతుపర్ణుఁడు, బాహుకుఁ౽ చూచి; నాకుఁ౽=నేను; దమయంతీద్వితీయస్వయంవరంబు, చూడఁ౽=చూచుటకు, ఒక్కనాఁడు అ =ఒక్కదినములోపలనే, విదర్భకుఁ౽; పోవలయును, నీఅశ్వనైపుణ్యంబు = నీగుఱ్ఱములను నడుపుటయందలి నేర్పును; ప్రకాశింపఁజేయుము = తెల్లముఁజేయుము. అనినఁ౽, అట్లు అ=అలాగే, చేయుదును. అని, నలుఁడు; తనమనంబునఁ౽; చింతించి=యోచించి.

163. అడవిఁ౽=అడవియందు; తన్ను; పాసి=విడిచిపెంచి, అఱిగినఁ౽ = పోవఁగా, అలిగికాదు న్నె=కోపముచేత నేకదా, ఉవిద = ఈదమయంతి, ఇట్లు చేయఁ౽=ఈప్రకారము రెండవస్వయంవరము జేయుటకు; కడఁగెఁ౽ = పూనెను. ఇట్లు అ ఏని =లోకమందిట్టివాడుక యుండు నేని, ఇంతులు= స్త్రీలు;మాకుఁ౽, కూర్తురు = మామీద నిష్టముగలిగియుందురు. అని; విశ్వసించువారు = నమ్మువారు, ఎందుఁ౽=ఏవిషయమునను, వెడఁగులు=మూర్ఖులు.

164. సాధ్వి = పతివ్రతయగు దమయంతి; నాకుఁ=నాయందు, కూర్మిను = ప్రేమగలిగియుండును, సంతతికలయది=బిడ్డలుగలది; చెలువ=దమయంతి, ఇట్టులు, ఏల; చేయును, ఐనఁ, దీనిఁ=ఈవృత్తాంతమును యెఱుఁగ వలయును. నేనును; ఋతుపర్ణునితోఁ=ఋతుపర్ణమహారాజుతోఁగూడ, పోదును అని, నలుఁడు, బుద్ధిఁ=తలఁపునందు, తలఁచి=ఎంచి.

165. తొల్లి=పూర్వము, వార్ష్ణేయుఁడు, తెచ్చిన తనరథంబునందుఁ, ఆలక్ష్యమాణశుభలక్షణంబులు - ఆలక్ష్యమాణ = ,చూడఁబడుచుండు, శుభ=మేలైన; లక్షణంబులు=చిహ్నములుగలవియు, వాయువేగంబులును = వాయువేగమువంటి వేగముగలవియు, ఐనవానిఁ = ఐనట్టి; హయంబులనుఁ= గుఱ్ఱములను; పూన్చికొనివచ్చినఁ=కట్టుకొనిరాఁగా; "ఋతుపర్ణుఁడు" ఆరథంబు ఎక్కినప్పుడు, హయంబులు = గుఱ్ఱములు, మ్రొగ్గినఁ=మోఁకాళ్ళు నేలకు ఆనునట్లు ముందుకువంగఁగా, చూచి. ఇప్పేదగుఱ్ఱంబులు=ఈబక్కగుఱ్ఱములు, అతిదూరంబు = మిక్కిలిదవ్వు; ఎట్లు; పోఁపనోపుఁ=పోఁజాలును, ఒండుగుఱ్ఱములఁ = వేఱుగుఱ్ఱములను; పూన్పుము=కట్టుము, అనినఁ =బాహుకుండు; ఇట్లనియె.

166. అవని ఈశ=రాజా; ఈహయంబు=ఈఅశ్వంబులు, పవనగతిఁ=వాయువేగమువంటి వేగముతో, ప్రొద్దు పడక ఉండఁగఁ=సూర్యుఁడస్తమించులోపల; నేఁడుఅ=యీదినముననే; విదర్భకుఁ = విదర్భాపురికి; పఱతుఁ=పరుగెత్తును. అనవుడుఁ = అనిచెప్పఁగా; విని, కువలయపతి=భూమండలపతియగు ఋతుపర్ణుఁడు, మెచ్చి, బాహుకునకుఁ, ఇట్లు, అనియెఁ.

167. అట్లయిన = అలాగైనచో; నీహయతత్త్వకౌశలంబు = నీయశ్వహృదయమందలి నేర్పును; ఎఱిఁగి=తెలిసికొని;నీకుఁ; అభిమతంబు=నీకోర్కెను; ఒనరింతును = చేసెదను. అని, రథంబు, ఎక్కి, బాహుకవార్ష్ణేయ సమేతుఁడయి-బాహుకవార్ష్ణేయులతోఁ; గూడినవాఁడయి, అరుగువాఁడు= పోవుచుండఁగా.

168. ఎదురన్ = ఎదుట, దవ్వులన్ = దూరములందు; చూచిన పొడవులు ఎల్లన్ = చూచునట్టి నిడివివస్తువులన్నియు, తత్క్షణము అ = వెంటనే; కదియఁగాన్ = సమీపింపఁగా; అవ్వి = అడవి; పిఱుఁదన్ = వెనుక; ఎంతయున్ = మిక్కిలి; దవ్వుఅయి = దూరమై; కనఁబడన్ = అగుపడఁగా; ఇది దినేశ్వరురథమో = సూర్యునిరథమో; ఇతఁడు; అనూరుఁడో = సూర్యునిసారథియో; అంచున్ = అప్పుడు; ఇక్ష్వాకుకులుఁడు = ఇక్ష్వాకువంశస్థుఁడైన ఋతుపర్ణమహారాజు; హృదయమునన్ = మనసునందు; కడున్ = మిక్కిలి; విస్మయము = ఆశ్చర్యము, అందెను.

169. వార్ష్ణేయుండు. విస్మయంబు = ఆశ్చర్యంబు, అంది; తనమనంబునన్ = తనమనస్సునందు. (పై. ప. అ.)

170. ఈతఁడు. శాలిహోత్రుఁడో = శాలిహోత్రుఁడను ఋషియో; మాతలియో = ఇంద్రునిసారథియో, నలుఁడు ఓ; ధారుణీమండలమునన్ = భూమండలమందు; ఒరులు మానవులు = ఇతరమనుష్యులు, జనఉపేతముగన్ = తొందరతోఁగూడునట్లుగా, ఇట్లు; రథహయసతి = రథాశ్వములనడుపుశాస్త్రమును; ఎఱుఁగుదురు ఎ = తెలిసికొందురా.

171. వయోవిద్యావైభవంబులన్ = వయస్సు; చదువు; సామర్థ్యము అనువానియందు, ఇతండు = బాహుకుండు; నలున్ పోలెడిన్ = నలుఁడనితోఁ చెడి; వికృతరూపధరుఁడు ఐనకారణంబు = మాఱురూపంబు దాల్చినవాఁడై నందులకు కారణము; ఏమియొ = ఏమిటో; మహాపురుషులు = గొప్పవారు; దేవనియుక్తులై = వేల్పులచేఁ బురికొల్పఁబడినవారయి; ప్రచ్ఛన్నవృత్తిన్ = రహస్యమైన నడవడితో, ఉందురు. వారిన్ = అట్టివారిని; ఎఱుంగన్ = తెలిసికొనుట; పోలునే = వీలగునే, అనుచున్, చనునప్పుడు = పోవునప్పుడు; ఋతుపర్ణుఁడు, తన ఉత్తరీయంబుజాతి = తనయంగవస్త్రముజాతి; భూతలంబునన్ = నేలమీఁద, పడినన్ = పడఁగా, మఱలి చూచి = తిరిగిచూచి, బాహుకా, వార్ష్ణేయుండు, పోయి = రథంబుదిగిపోయి; ఉత్తరీయంబు = అంగవస్త్రమును, తెచ్చునంతకున్ = తెచ్చువఱకును; రథగమనంబు = తేరిపోక, ఇంచుక = కొంచెము, మం

దంబు నేయుము, అనినన్=తగ్గింపుమనఁగా, బాహుకుండు, నగి=నవ్వి, ఉత్తరీయంబు=పయ్యంగవస్త్రము, పడినయెడ = పడినచోటు, ఇచ్చోటికిన్ = ఇక్కడికి, ఒక్కయోజనంబు, కలదు. వార్ష్ణేయుండు, యెట్లు, తేనేర్చును= తేఁగలఁడు. అ౧. రథగమనవేగమహాత్మ్యంబు-రథ = తేరియొక్క; గమన= నడకయందలి, వేగ=వడియొక్క, మాహాత్మ్యంబు = నేర్పు, చెప్పుచున్, అనేకదేశంబులు, కడచినన్ = దాటివెళ్ళఁగా, ఒక్కయెడన్ = ఒక్కచోట, అగణ్య...తంబు-అగణ్య = లెక్కపెట్ట నలవికాని, పర్ణ = ఆకుల తోను. శాఖా=కొమ్మలతోను, అలంకృతంబు = సింగారింపఁబడి యుండు నది; ఐన, విభీతకవృక్షంబున్ = తాండ్రచెట్టును, కని, ఋతుపర్ణుండు, బాహుకునకున్, ఇట్లు, అనియె.

172. ఎల్లవారును=అందఱును, ఎల్లవానిని = అన్నివిద్యలను, ఎఱుంగరు=తెలియరు. విద్యలందున్ = చదువులలో, ఎల్లవారును, భిన్నవిషయులు=వేఱుపడినవిషయముగలవారు, వేఱువిషయముల నెఱిఁగినవారనుట.ఏను, దృష్టిమాత్రన = చూచినతోడనె, సకలవస్తుచయముసంఖ్య-సకలవస్తు = అన్ని వస్తువులయొక్క, చయము = గుంపుయొక్క,సంఖ్య=లెక్క,తొలఁగక=తప్పకుండ, ఎఱుఁగుదును=తెలిసికొందును.

173. ఇవ్విభీతకంబునన్ =ఈతాండ్రచెట్టునందు, ఫలపర్ణసముదాయ సంఖ్యను=పండ్లయు ఆకులయు గుంపులయొక్క మొత్తమును, చెప్పెదను, వినుము. ఈరెండుశాఖలన్ = ఈరెండుకొమ్మలయందు, కల, పర్ణఫలంబులు = ఆకులు, పండ్లు, పదివేలును ఒక్కండు = 10001, తక్కినశాఖలన్, కలయవి = ఉండునవి, రెండువేలునుందొంబదియేను = 2095, అనినన్, బాహుకుఁడు, విని, వీనిని, ఎన్నకాని = లెక్కపెట్టికాని, నిశ్చయింపన్ నేరను = నిర్ణయింపఁజాలను, అని, రథంబున్, నిల్పి; ఆవృక్షంబు = ఆచెట్టును, అక్షణంబున = ఆవెంటనే ఉరులన్ త్రోచి = పడఁద్రోసి, అయ్యై శాఖలయాకులన్ = ఆయాకొమ్మలయందలియాకులను ; పండులును=పండ్లను, ఎన్నినన్ = లెక్కపెట్టఁగా, ఋతుపర్ణుఁడు;చెప్పినయన్నియ= చెప్పినన్నియే;

ఐనన్=ఉండఁగా; అచ్చెరుపడి = ఆశ్చర్యమునొంది; ఇవ్విద్య; నాకున్; ఉప దేశింపవలయును; అని; అడిగినన్; ఋతుపర్ణుఁడు; ఇట్లనియె.

174. ఇది; అక్షహృదయంబు; అనఁగాన్; విదితంబు= పేర్కొనఁబడి నది. అగువిద్య; దీనిన్ = ఈవిద్యను; విధియుక్తంబుగాన్= శాస్త్రమందుఁ జెప్పఁబడినవిధముగా; మదిన్ = మనసున-బుద్ధియందు; ఎఱుఁగునరుఁడు= తెలిసికొన్న వాఁడు; - సంఖ్యలను జెప్పఁగలవాఁడు అగును. దుష్కృతకళంకవిష ముక్తుఁడు = పాపమువలనను; నిందలవలనను; విషమువలనను విడువఁబడిన వాఁడు; అగును.

175. ఋతుపర్ణుండు; కరఁబు=మిక్కిలి; రయంబుతోన్ = నడితో; విదర్భకున్, చనువేడ్కన్ చేసి = పోవుతుత్సాహమువలన; పూర్ణమనఃప్రప న్నుఁడుఐ = నిండుమనస్సుచేత ననుగ్రహించినవాఁడై; సకలగుణప్రసిద్ధుఁడు = (నలుఁడు) అన్నిసుగుణములచేఁ బ్రఖ్యాతి చెందినవాఁడు; అగును. సర్వహి తుండు=అందరికిమేలుచేయువాఁడును; అగును. చూవె = సుమీ; అంచున్= అనిచెప్పుచు; అతిఅకుటిలబుద్ధిన్ =మిక్కిలిచక్కనైన తలంపుతో; బాహుకు నకున్; ప్రీతితోడన్; విధియుక్తముగాన్ = శాస్త్రవిధితోఁగూడి; అక్ష హృదయంబు=అక్షహృదయమనెడి విద్యను; ఉపదేశము ఇచ్చెను = ఉపదే శించెను.

176. ఇట్లు; నలుఁడు; ఋతుపర్ణుచేతన్; అక్షహృదయంబున్; పడసి; సంతుష్టుండు ఐ; నీకున్; అశ్వహృదయంబు = అశ్వహృదయమనెడి విద్యను; ఇచ్చెదను. పరిగ్రహింపుము. అనినన్; ఋతుపర్ణుండు; అట్లుఅ=అట్లే; చేసె దను. అంతకున్ =నేనుతీసుకొనునంతనఱకు; నీయందున్ అ=నీయందె; ఉండ నిమ్ము.అది=దానిని; నావలచినప్పుడుఅ=నాకుఁగావలసినప్పుడే;చేకొనియెదను =తీసికొందును. అనియె. అంతన్ = తర్వాత; ఆఅక్షహృదయసామర్థ్యంబు నన్ = అక్షహృదయమందలి యానేర్పుచేత; అప్పుడుఅ=అప్పుడె.

177. నలున్; తొల్లి=పూర్వము; ఆక్రమించిన కలి=చుట్టుకొనియున్న కలిపురుషుఁడు; కర్కోటకవిషంబున్ = కర్కోటకునియొక్క విషమును; గక్కుచున్; విహితఅంజలిఐ = చేతులుజోడించుకొన్నవాఁడై; చంచలుఁడు

చున్ (భీతిచే) కదలుము, తన్నున్, ఎఱుఁగన్ చెప్పెన్ = తాను పలాని వాఁడని యెఱిఁగించెను.

178. వానిన్=ఆకలిపురుషుని, చూచి, నలుఁడు. తాను, అల్గి = కోపపడి, శాపము ఈన్ ఉన్నన్=శపింపఁబోవుచుండఁగా, కలి, ఎఱింగి = (ఆసంగతి) తెలిసికొని, నిన్నున్ పొంది = నీలోఁబ్రవేశించి, అహివిషంబుచేతన్ = సర్పముయొక్క విషముచేత, అనయంబు=ఎల్లప్పుడును, దగ్ధుండనుఐతిని=మాడితిని, అనఘ=పాపములేనివాఁడా; ఇంకన్, నాకున్=సైఁపు=నన్ను క్షమింపుము.

179. నిన్నున్, కీర్తించినజనులు=పొగడినజనులు, నావలనిభయంబు = నాభీతిని, పొందరు=చెందరు. నాకున్ = నాయెడ, కరుణింపుము=దయసేయుము. అనినన్, నలుఁడు; కోపంబుడిగె = కోపంబువిడిచెను. కలియు=కలిపురుషుఁడు, అవ్విభీతకంబున్ = తాండ్రచెట్టును, ఆశ్రయించెన్ = పొందెను. అదిమొదలుగా = అదిమొదలుకొని, అవ్విభీతకంబు = ఆతాండ్రచెట్టు, అప్రశస్తంబుఅయ్యెన్ = అప్రసిద్ధమయ్యెను. అట్లు, నలుఁడు, వికృతరూపమాత్రంబుతక్క = మాఱురూపం బొక్కటితప్ప, తక్కిన దుష్కృతంబువలనన్=తక్కినపాపంబువలన, విముక్తుఁడు ఐ = విడువఁబడినవాఁడై; రథంబు ఎక్కి; అతివేగంబునన్=మిగులవడితో, ఋతుపర్ణ వార్ష్ణేయసమేతుఁడుఐ = ఋతుపర్ణునితోను వార్ష్ణేయునితోను గూడినవాఁడై, విదర్భకున్, చనియెన్, అంతన్=తర్వాత, సాయాహ్నమునన్=సాయంకాలమునందు.

180. ఋతుపర్ణుఁడు, రథధ్వానంబు=తేరిమ్రోఁత, ఘనధ్వనివోలెన్ = ఉఱుమువలె, నానాదిక్ ముఖములన్= అన్నిదిక్కులయందు, మ్రోఁగుచుండన్=ధ్వనించుచుండఁగా, ఋతుపర్ణుండు; మానున్ = గౌరవముతో, భీమ అనుజ్ఞాతుండు ఐ = భీమరాజుచే నుత్తరువుపొందినవాఁడై, ఆప్రోలు = ఆవిదర్భాపురంబును, చొచ్చెను=ప్రవేశించెను.

181. దమయంతి, ఆరథస్వని=తేరిచప్పుడు, విని, నలురథఘోషము = నలునితేరుసద్దు, అని, అనురాగము=సంతోషము, ఒంది=పొంది, పుణ్యశ్లోకున్=

పుణ్యమునొనర్చు కీర్తిగలవానిని, లోకఉపకారకుఁ=జనులకుహితముఁజేయు వానిని, నిషధఈశుఁ = నిషధదేశపు రాజగువానిని, నలుఁ, చూడఁ కఁ కంటిని=చూడగఁగితిని, అనుచుఁ=చెప్పుచు, ఘనభుజుఁ=నిడుపుచేతులుగల వానిని, చూడఁకఁ కానని నాఁడుఁ = చూడనోచుకొననిదినమునను, తత్ భుజపరిరంభణమునఁ-తత్=అనలునియొక్క, భుజ=బాహువులయొక్క, పరి రంభణమునను=ఆలింగనముచేతను, సుఖము=సౌఖ్యము,పడయనివాఁడుఁ=పొం దనియెడల,నేను,ప్రాణంబు,విడుతును,అని, తలంచుచుఁ, కమలఆయతఅక్షి= తామరపువ్వుల రేకులవలె నిడివియైన కన్నులుగల యాదమయంతి, ఆరథఅధి రూఢుఁడు-ఆరథము నెక్కినవాఁడై, వచ్చు, ఋతుపర్ణుఁ, చూచి, అప్పుడు, అధిశోకతప్తఅగుచుఁ ఉండె = ఎక్కువ దుఃఖమనెడి సెగచే మాడినదై యుండెను. అంతఁ=తర్వాత, ఆఋతుపర్ణుఁడు, ప్రియముతోడఁ = ప్రేమ తో, భీముఁ=భీమరాజును, కానఁవచ్చెను=చూడవచ్చెను.

182. భీముఁడును; వానిఁ=ఆఋతుపర్ణుని; పూజించి=గౌరవముచేసి, ఒక్కరమ్యహర్మ్యంబునఁ=ఒకయందమయినమేడయందు, విడియించినఁ =విడిచిచూడఁగా; ఋతుపర్ణుండు, ఆపురంబునఁ=ఆపట్టణమందు, స్వయం వరంబు అనుశబ్దము = స్వయంవరంబనెడి సందడి, వినఁ కానక = వినక, ఆత్మగతంబునఁ=తన మనస్సునందు.

183. ధరణిఁ=భూమియందు; కలరాజులు; ఇందుఁ; ఎవ్వరు; వచ్చి నవారు; లేరు=కనంబడలేదు. వైదర్భి = దమయంతి; ఒరుఁ = ఇతరుని; వరి యింపఁ=కోరుటకు-పెండ్లాడుటకు; అంత=మిక్కిలి; ధర్మ్యఇతరచరితయో– ధర్మ్య = నీతిదప్పనిదానికంటె; ఇతర = వేఱగుఅన్యాయమయిన; చరితయో =నడవడిగలదా; అనుచుఁ=ఎంచుచు; తద్దయుఁ=మిక్కిలి; లజ్జఁ = సిగ్గు తో; ఉండెను.

184. బాహుకుండును; రథశాలఁ = తేరిగుఱ్ఱములఁగట్టు చావడియం దు; రథఅశ్వంబులఁ = తేరిగుఱ్ఱములను; బంధించి = కట్టి; రథసమీ పంబునఁ=తేరిచేరువను; విశ్రమించి = బడలికదీర్చుకొని; ఉండునంతఁ =

ఉండఁగా; దమయంతి; బాహుకవార్ష్ణేయులతోడన్; వచ్చినఋతుపర్ణున్; చూచి; విఫలమనోరథ ఐ= వ్యర్థమైనకోరికగలది - ఆశ నిరాశ చేసికొన్నదియై; ఉండన్ఓపక = ఉండఁజాలక; కేశినిఅనుదానిన్ = కేశినిఅనుపేరుగల చెలికత్తెను; పిలిచి; ఋతుపర్ణున్, అయోధ్యాపతిన్ కాన్ = అయోధ్యకు రాజుగాను; వార్ష్ణేయున్-సూతపుత్రునిన్ కాన్ = సారథినిగా; ఎఱింగితిని, బాహుకుండు; అనువాఁడు ఎవ్వఁడు-ఓ; వానియందున్; నాహృదయంబు=నామనస్సు; కరంబు = మిక్కిలి; ముదితంబు = అనురాగంబుగలది; అగుచున్నయది. మనపర్ణాదునకున్; ప్రతివచనంబు=బదులుమాట; ఇచ్చినవాఁడు, వాఁడు ఆ=అతఁడే; కావలయును=ఉండవలయును; వానికడకున్; పోయి; ఎఱింగి = సంగతితెలిసికొని; రమ్ము. అని; పంచినన్ = చెప్పఁగా; అది; పోయి; బాహుకున్; కని, దమయంతి; నీకుశలంబు = నీక్షేమము; అడుగన్=విచారించుటకు; పుత్తెంచెను=పంపెను. ఇందులకున్=ఇచ్చటికి;ఏమికారణమునన్, వచ్చితి; అనినన్; దానికిన్=ఆకేశినికి; బాహుకుండు; ఇట్లు; అనియెను.

185-186. వినుమీ= ఆలకింపుమీ. దమయంతి; ప్రియమునన్=ప్రేమతో; పునస్స్వయంవరము = తిరిగిస్వయంవరంబును; చేయన్ కడంగి = చేయ ప్రయత్నించి; సకలక్షత్రియ అన్వయవీరులన్=అన్నిరాజవంశపుశూరులను; రావించినన్=పిలిపింపఁగా;నయవిధి=నీతిశాస్త్రమునకు స్థానభూతంబయిన ఋతుపర్ణుఁడు; ఒక్కనాఁటన్ఆ=ఒకదినముననే; అయోధ్యనుండి=అయోధ్యాపురంబునుండి; ఇందులకున్సరి=ఇక్కడికి సరిగా; శతయోజనంబులు = నూఱామడలదూరము; చనుదెంచెను=వచ్చెను. నేనును; అతనిసారథినై; ఇటన్=ఇచ్చటికి; వానితోన్ = ఆఋతుపర్ణునితోఁగూడ , మనోవేగమునన్=మనస్సుకుఁగల వేగముఁబోలు వేగముతో; వచ్చితిని.

187. నావుడున్ = అనిచెప్పఁగా; మూఁడవవాఁడు; ఎవ్వఁడు; అని; అడిగినన్; ఆకేశినికిన్; బాహుకుండు; ఇట్లు అనియె.

188. అతఁడు నలరథచోదకుఁడు=నలునిరథంబుదోలువాఁడును;అతిఅలఘుఁడు=మిక్కిలి నైపుణ్యముగలవాఁడును; వార్ష్ణేయనాముఁడు= వార్ష్ణేయుఁడను

పేరుగలవాఁడు; అనవుడున్ = (అనిపలుకఁడు) చెప్పఁగా; వాఁడు = ఆవార్ష్ణేయుఁడు; ఆనలభూపాలకుపోయినవలను=ఆనలమహారాజుపోయినప్రదేశము; ఇది అని=పలాదియని; ఎఱుఁగుదు ఒకో = తెలియునా; అనన్ = (అని కేశిని) అడుగఁగా; వాఁడు=ఆబాహుకుఁడు; ఇట్లనియెన్.

189. వార్ష్ణేయుండును; నలుపుత్రులన్=నలమహారాజుబిడ్డలను; విదర్భేశ్వరుఁనొద్దన్= విదర్భరాజువద్ద; పెట్టిపోయి = విడిచిపోయి; నలురాజ్యభ్రంశంబు = నలుఁడు రాజ్యము పోఁగొట్టుకున్న వార్తను; విని; ఋతుపర్ణున్; కొలిచియుండెన్ = సేవచేయుచుండెను. అతఁడును = ఆవార్ష్ణేయుఁడును; నలున్; ఎఱుంగఁడు.

190. నలునితోన్; ఒక్కటన్ = కూడ, అరిగిన నళినాయతనేత్ర = వెళ్ళిన కమలలోచనయగు, భీమనందనయొండెన్ = దమయంతిగాని; నలుఁడు ఒండెన్=నలుఁడుగాని; ఎఱుఁగున్=తెలిసియుండును. ఒరులకున్=ఇతరులకు నలున్; ఎఱుఁగన్=తెలిసికొనుటకు; మహిన్=భూమియందు; కారణము = నిమిత్తము; కలదే=ఉన్నదా? (లేదనుట.)

191. అనినన్; విని, కేశిని; ఇట్లనియె.

192. ఆపదనిలోన్; వస్త్రార్ధహారిఐ=కోకలోనసగముచించుకొన్నవాఁడై; దయ=కనికరము; లేక; ప్రాణఈశ్వరుఁడు=ప్రాణనాథుఁడు-భర్త; తన్నున్ పాసి=విడిచి; చనినన్=వెళ్ళఁగా; నాటిఅర్ధవస్త్రంబు=ఆదినముకట్టినసగము కోకయే, పరిధానముగన్=కట్టుబట్టయై యుండఁగా, పాంసుపటలమలినము = దుమ్మురాశిచేనల్లనిది; అగుచున్న; తనువుతోన్=దేహముతోను; అనయంబు=ఎల్లప్పుడు; జడగొన్న=జడయైన, అలకఅవళులతోడన్=ముంగురులసమూహముతోను; (కూడి) అవనితలము=పుడమి, శయనంబుగాన్=పాన్పుగాఁగా;

దమయంతి, ధర్మచారిణి=పతివ్రతాధర్మంబు నడచుచున్నదియై, అనఘవ్రతంబులన్=పాపంబుం బోఁగొట్టు వ్రతములను, ఆచరించుచున్నది = చేయుచున్నది. అనిన =అనిచెప్పఁగా, నలుఁడు, అవిరళ...ర్ణంబు-అవిరళ=దట్టముగా, ఉద్గత=బయలుదేరుచున్న, బాష్ప=కన్నీటితో,పూర్ణంబులు=నిండినవి. అయిన, లోచనములు=నేత్రములు, ఎఱుకపడకయుండన్=దృష్టి తెలియక యుండఁగా; వదన పద్మంబు = కమలమువంటి ముఖమును; వాంచి, తాను, ఒండువలను = మఱియొక్క వైపు; చూచుచుండెను.

193. కేశినియున్, బాహుకుపలుకులు=బాహుకునిమాటలు; ఆకారంబును=స్వరూపమును; దమయంతికిన్, ఎఱింగించినన్=తెలుపఁగా, అది=దమయంతి; అతఁడు, నలుఁడు కాన్=నలునిఁగా,శంకించి=సందేహపడి,ఇంకను=తిరిగి, వానికడకున్; పోఁగుము=వెళ్లుము; వాఁడుబుతుపర్ణువంటలవాఁడుఅట. పచన సమయంబున = వంటచేయు సమయమున; వానిచరితంబు = వానిసంగతి; ఎఱింగిరమ్ము=తెలిసికొనిరమ్ము; అని; పంచినన్= పంపఁగా; అప్పుడే, చని; కేశిని; బాహుకునందున్; ఉన్న; దైవ...క్రియలు-దైవ=దేవసంబంధములైన; మానుష=మనుష్యసంబంధములైన; నిమిత్త=కారణములుగల; అద్భుతక్రియలు =ఆశ్చర్యకరంబులైనపనులు; చూచి; వచ్చి దమయంతికిన్; ఇట్లు; అనియెన్.

194.అతనిచరితంబు=అతనిప్రవర్తనము;చెప్పఁగన్=చెప్పుటకు;అతిమానుషము=ఆశ్చర్యమైనది; అపగతప్రయాసము=కష్టములేనిది; అదృష్టశ్రుతపూర్వము=ఇంతకుముందు; చూడను వినను బడనిది పరమార్థముల = నిజముగానే; అంబుజనేత్రా=కమలాక్షీ; అతనిని; దైవము అనవలయున్ = దైవమని చెప్పవలయును.

195. వినవమ్మ=వినుముఅమ్మ; వాఁడు=ఆబాహుకుఁడు; తృణముష్టిన్= గడ్డిపిడికిటిని=పిడికెడుగడ్డిని; వీచినన్=విసరినట్టైన; అందున్ = ఆగడ్డియందు; అగ్ని=నిప్పు ఉదయించి=పుట్టి; అందున్ = ఆనిప్పునందు; వంటలు; అమరునంతకున్=జరుగునంతవఱకు; ఇంధనము=కట్టెలు; అపేక్షింపక; ఉడుగక =

విడువక; మండుచున్; ఉండును. మఱియున్ = ఇదియును గాక; కడంకతోన్ = సంతోషముతో; నంజుళ్లు = మాంసములు; కడుగఁగన్ = కడుగుటకు; సమకట్టి = పూని; జలము = నీరు; అపేక్షించుచున్ = కోరఁగా; చూడఁగన్ = విచారింపఁగా; ఆక్షణమున = అదే క్షణమున; దివ్యఅంభఃప్రవాహము = దివ్యమైననీటివెల్లువ; సంభవించి = పొడమి; కుంభముల్ = కడవలు నిండుగా; నిండి; క్షయము అగుచుండున్ = తఱుఁగకయుండును; అతని...మర్దితము ఐ - అతని = ఆనలునియొక్క; కరద్వయ = రెండుచేతులచేత; అవమర్దితము ఐ = నలపఁబడినదై; కందియును = వాడియును; మహో...త్కతులు = మహత్ = మిక్కిలి; సుగంధ = కమ్మనివాసనగల; కుసుమ = పువ్వులయొక్క; తతులు = గుంపులు; తొంటియట్ల = పూర్వమువలెనే, తమకంపు = తమవాసనను; విడువక ఉండును. ఆతని తేజము = ఆనలుని కాంతి; ఉన్నతము = హెచ్చినదిగా; ఉన్నది.

196. అరిగినన్; విని; దమయంతి; వెండియున్ = తిరిగి కేశినిన్, పిలిచి: బాహుకువండిననంజుళ్లు = బాహుకుండువండినభక్ష్యవస్తువులను; తెప్పించి; ఆస్వాదించి = రుచిచూచి; బాహుకుండున్: నలులక్షణంబులు = నలునిగుణములు; కలుగుట = ఉండుట. ఎఱింగియున్ = తెలిసియు; ఊఱడన్ ఓపక = సమాధానము నొందఁజాలక; వానిపాలికిన్ = ఆబాహుకునియొద్దకు; కొడుకునున్, కూఁతునున్ = కుమార్తెను; కేశినితోడన్ = కేశినితోఁగూడ; పంచినన్ = పంపఁగా; ఆకుమారునిన్ కూఁతున్ = ఆకూఁతును కొడుకులను జూచి.

197. నలుఁడు; బాష్పవారి = కన్నీరు; వశము కాక = స్వాధీనము కాక; ఒల్కుచున్ ఉండఁగన్ = కాఱుచుండఁగా; కొడుకున్; కూఁతున్; ఎత్తుకొని; హర్షపులకిత అంగుండు ఐ = సంతోషముచే గగుర్పాటుతోఁగూడిన శరీరము గలవాఁడై; నిజఅంకతలంబునందున్ = తనతొడమీఁద; వారిని = ఆకొడుకు కూఁతులను; ఉనిచి = కూర్చుండఁబెట్టుకొని; ఆదరమునన్ = ప్రీతితో.

198. ఆకేశినిఁ, చూచి; ఈకుమారులు=బిడ్డలు; ఇద్దఱు; నాకొడుకుఁ కూఁతుఁరుఁ పోలినఁ=నాబిడ్డలవలెనుండఁగా, వీరిని; ఎత్తుకొని; దుఃఖించితిని; అని; తన్నుఁ=తనసంగతి; ఏర్పడఁగ ఉండఁ = తెలిసికొనకుండునట్లు; పలికి=చెప్పి; దానికిఁ, ఇట్లు; అనియెఁ.

199. నీవు; ఇటఁ=ఇచ్చటికి; పలుమఱు=అనేకపర్యాయములు; వచ్చుచుఁ పోవుచు ఉనికిఁ=రాకపోకలు చేయుచుండుటచేత; ఇతరజనములు = పొరుగువారు; కని=చూచి; చిత్తములఁ=మనస్సులందు; ఒండుగఁ=వేఱురీతిగా; సంభావింతురు = తలంతురు. కావునఁ; ఇంకఁ=ఇఁకమీఁదట; కార్యార్థిని ఐ = పనులను గోరినదానవై; రాఁవలవదు=రావద్దు.

200. ఏను; దేశాంతరమునుండి=ఇతరదేశములనుండి; వచ్చిన యతిథులము=విందులము. నీకుఁ, మాతోడిది=మాతోఁగావలసినది; ఏమి; అనినఁ; కేశినియుఁ; క్రమ్మఱి=తిరిగి; వచ్చి; బాహుకుమార్గంబు = బాహుకునిరీతి; అంతయుఁ=యావత్తును; చెప్పినఁ=చెప్పఁగా; అది = ఆదమయంతి, సంతసించి; నిజజననికిఁ=తనతల్లితోఁ; ఇట్లు; అనియె.

201. సందియము=సంశయము; ఏల=ఎందుకు; సర్వగుణసంపదఁ = యావత్తు సుగుణములకలిమిని; చూడఁగఁ=యోచించిచూడఁగా; బాహుకుండు; తాను; అవశ్యము=తప్పక; భూవందితుఁడు = భూమియందలిజనులచే స్తోత్రముచేయఁబడువాఁడు; ఐననైషధుఁడు=నలుఁడు; అగును. నామనంబును=నామనస్సునైతేము; ఆనందమునఁ; సంతోషమును; పొందుచున్నది. ఘనంబుగఁ=మర్యాదతో; వాఁడు=ఆనలుఁడు; ఇటకుఁ=ఇచ్చటికి; వచ్చువాఁడో=వచ్చుటయో; ఏను; అందులకుఁ=అచ్చటికి; ఏఁగుదాననో=పోవుటయో; నయంబుగఁ=చక్కఁగా; ఆనతి; ఇమ్ము. నాపుకుఁ=ఓరిముముగఁగా.

202. అది= ఆదమయంతియొక్క తల్లి; భీమునను మతంబునన్ = భీముని యంగీకారముచేత; దమయంతియొద్దకున్; బాహుకున్; రావించినన్ = పిలిపింపఁగా.

203. నలుఁడు; చనుదెంచి=వచ్చి; అందున్=ఆభీమరాజుగృహంబునందు; దీనఆననన్=వ్యసనముగల ముఖముగలదియు; అవిర...గాత్రన్- అవిరళ= దట్టమైన, పంక=బురదవలె; మలిన=మురికియైన; నత=వంగిన; గాత్రన్ = శరీరముగలదియు, తపస్వినిన్=దుఃఖపడుచుండునదియు, అతికృశన్ = మిక్కిలి చిక్కినదియు; ఉదిత...ముఖిన్-ఉదిత=పుట్టిన; బాష్ప=కన్నీటియొక్క; కణ=బిందువులతో; కలిత=కూడిన; ముఖిన్ = మోముగలదియునైన దమయంతిన్; కని యెన్.

204. దమయంతి; నలుని వికృతాంగమునన్ = నలునియొక్క యసహ్యరూపంబును; చూచియున్=చూచినప్పటికిని, అతనిన్; అన్యుంగాన్ =వేఱొక్కనిఁగా; నగవక=ఎంచక; నెయ్యమునను=ప్రేమచేతను; లజ్జను = సిగ్గుచేతను; భయసంభ్రమమునన్ = భీతిచేతను; తత్తఱపాటుచేతను; వివశఆత్మ అగుచున్=స్వాధీనముతప్పిన తెలివిగలదయి; (స్మృతిలేనిదై) పతికిన్; ఇట్లు అనియెన్.

205. విజనంబు ఐనవిపినంబునన్ = మనుష్యసంచారము లేని యడవియందు;అలసి=శ్రమపడి, నిద్రపోయిన; అబలన్=ఆఁడుదానిని; అతిసాధ్విన్ =మిగులమంచిదానిని; అనువ్రతన్ = తన్నుఁబోలినదానిని; అగ్నిసన్నిధిన్ = అగ్నిహోత్రునియెదుట; పాణిగ్రహణవిధిలబ్ధ ఐనదానిన్ = పెండ్లి యను కార్యముచే పొందఁబడినదానిని; పాసి=వదలిపెట్టి; నలునట్లు=నలునివలె; నిర్దయులై = కనికరములేనివారయి; అఱిగినవారలు = పోయినట్టిమానవులు, ఒరులు=ఇతరులు, లేరు.

206. సురవరులన్=వేల్పులలో పెద్దలను, మెచ్చక=కోరక; తనున్ (నలుని అనుట) వరియించిననన్నున్=కోరిననన్ను, పుత్రవతిన్ = బిడ్డలుగల దానిని, ఏలకో=ఎందుకో; చెచ్చెరన్ = వెంటనే విడిచెను. నిష్కారణముగ

కుఁ=దయమాలినవాఁడగు; అతనికిఁ; ఏను; ఏమి; ఎగ్గు=అపకారము; కావించితినొ=చేసితినో.

207. ప్రాణసమానవు ఐన నిన్నుఁ; విడువను=విడిచిపెట్టను. వెఱవక ఉండుము=భయపడకుండుము. అనిన ఆపలుకులు= చెప్పినయామాటలు; ఏల మఱచెనో; అని శోకతప్తంబు = దుఃఖముచే మాడినది; ఐన, తనహృదయంబుఁ=తనమనస్సును; తెడుపుచున్నదియునుంబోలెఁ=తెడుపుదానివలె, బాష్పధారలఁ=కన్నీటిధారలచేత; ఉరస్థలంబుఁ = ఱొమ్మును; తడుపుచున్న దమయంతిఁ; చూచి; నలుఁడు; దుఃఖితుఁడు ఐ = వ్యసనముచేఁ గలవరపడినవాఁడై; ఇట్లు; అనియెఁ.

208. నేను; కలి...మతినయి–కలి=కలిపురుషునిచే; సమావిష్ట=ప్రవేశింపఁబడిన; మతినయి = బుద్ధిగలవాఁడనై; కలిపురుషుని ప్రేరణచేత; కష్టవృత్తిఁ=నీచతనముతో, అట్టియెడుమను = అట్టికష్టమందు; పడితిని = చిక్కొంటిని. అది = ఆకలిపురుషుఁడు; మదీయ...లమునఁ–మదీయ = నాదైన; తపము=తపస్సుయొక్క; బలమునఁ=బలిమిచేతను; దుష్కర్మదహనమునఁ =చెడుకర్మ నశించిపోవుటచేతను; ఇప్పుడు; నన్ను; విడిచిపోయెను.

209. ఏను; ఇందులకుఁ=ఇచ్చటికి; నీతదర్థంబు=నీకొఱకు; వచ్చితిని; అదిఅట్లు ఉండెఁ = ఆసంగతి యట్లుండనిమ్ము. అనురక్తుఁ = ప్రీతిగలవానిని; అనువ్రతుఁ = ఏకపత్నీవ్రతముగలవానిని, నన్నుఁ; ఎంచక = తలంపక; అన్యఅపేతుఁ=వేఱొకనియందు మనస్సుతో; పునఃస్వయంవరంబు=మరలస్వయంవరము; రచియించుట అది — చేయుట; కులస్త్రీధర్మంబు కాదు. రాజులఁ ఎల్లఁ=రాజులనందఱిని; ఈస్వయంవరంబునకుఁ; రావించుటఁ చేసికాదె = పిలిపించుటచేతనేకదా, ఋతుపర్ణుఁడు వచ్చెను. అనినఁ = అని నలుఁడు చెప్పఁగా, దమయంతి; కృత అంజలి ఐ = చేతులు జోడించినదై, ఇట్లు; అనియెఁ.

210. నిన్నుఁ; రోయంగఁ=వెదకుటకు; విప్రులు = బ్రాహ్మణులు, నెమ్మిఁ=ప్రేమతో; అరిగి; నాచేతఁ; పలుకఁబడిఅ = చెప్పఁబడినట్లై; ఎల్ల

చోఁ = అన్నిచోట్లను; పలికిరి. అందుఁ = వారిలో; పర్ణాదుఁడు అను విప్రుఁడు = బ్రాహ్మణుడు, ఆ అయోధ్యకుఁ; ఏఁగి, నిన్నుఁ; ప్రతివచనంబులఁ=నీబదులుమాటచేత; ఎఱింగెను=గుర్తువట్టెను.

211. ఆపర్ణాదునివలనఁ; (నీవృత్తాంతంబు) ఎఱిఁగినదాననై; నిన్నుఁ; ఇటుఁ; రావించునుపాయంబుఁ = పిలిపించునుపాయము, తలంచి; ఎల్లి = రేపు, దమయంతి ద్వితీయస్వయంవరంబు; అగును = జరుగును. అని; ఋతుపర్ణుకడఁ = ఋతుపర్ణుని సమీపమున, ప్రకాశింపఁ= తెలియఁబఱచుటకు; సుదేవుండు అనుబ్రాహ్మణుఁ, పుత్తెంచితిని=పంపితిని.

212. అధిపా=ఓనాథా; నరవరుఁడు = మనుజులలో శ్రేష్ఠుండయిన; నలుఁడుకాక = నలుఁడుతప్ప; ఎవ్వరు; శతయోజనములు = నూఱామడలు; ఒక్కవాసరమునఁ = ఒక్కదినంబులోపల; వత్తురు=రాఁగలరు. అని; దీనిఁ = ఈసంగతిని; పరికింపఁ = పరీక్షించుటకై; వేఁడి=కోరి, ఇట్లుపంచితిని = బ్రాహ్మణు నంపితిని.

213. ఆనతవైరి=శత్రువులనుస్వాధీనముఁజేసికొనినయోనాథా; నేను; అతిపాపభావమునఁ=ఎక్కువచెడుతలంపుతో; ఎగ్గు=చెఱుపు; తలంపను=ఎంచినదానను గాను. ఒండుగాఁ=వేఱొక్కవిధముగా; తలంపకు(ము) = ఎంచకుము. నీఅడుగులు=నీపాదములు; అంటుంగఁ; ఓపుదును = చాలుదును. అట్లు అ ఐనఁ=అప్రకారమే యన్యునికోరియున్నయెడల; నన్ను, ఈనలినఆప్తుఁడు=(తామరలకిష్టుఁడైన) ఈసూర్యుఁడు; ఈఅనలుఁడు = ఈఅగ్నిహోత్రుఁడు; ఈమృగలాంఛనుఁడు= ఈచంద్రుఁడు (కుందేటినిఁ జేతఁబట్టినవాఁడు). ఈసురఉత్తముల్=ఈదేవతలలో గొప్పవారు; కోపపరీతచిత్తులు ఐ = కోపముచేఁ జుట్టఁబడినమనస్సుగలవారై; జాను = సొగసు; అడఁగఁ = నశించునట్లు; ఆక్షణము అ = ఆవెంటనే; చంపరుఎ = చంపరా. (నేను నిన్నుఁదప్ప యితరునిఁ గోరియుండునేని; సూర్యచంద్రాదులగు దేవతలు నీపాదములంటిన నన్ను దహింపఁజేయుదురు.) అని తా.

214. అనుచున్న; అవసరంబునఁ=సమయమునందు; అఖిలభూత అంతర్గతుఁడు ఐన = అన్నిప్రాణులలోపల నుండునట్టి; వాయుభట్టారకుండు =

వాయుదేవుఁడు; ఎల్లవారును=అందఱును, వినన్ = ఆలకించునట్లు; ఆకాశం బునన్; ఉండి; నలునకున్; ఇట్లు; అనియె.

215. నృపఉత్తమ=రాజశ్రేష్ఠుఁడా; వినుము. అమలచరిత్రన్=నిర్మలమైన నడవడిగల, పతివ్రతన్; దమయంతిని; ఇట్లు; పల్కుదువు ఎ = ఆడవచ్చునా? దీనియందున్=ఈదమయంతియందు; విదితంబు=కనిపించునట్టి; అగు; శీలనిధిన్=నడవడియనుకాణాచిని; సుధాంశుఁడును, చంద్రుఁడును; కమలహితుండును=సూర్యుఁడును; నేనును; ఒకటన్=కూడి; మూఁడువర్షములన్ = మూఁడేండ్లు; తగన్ =ఒప్పునట్లు, బాగుగా; కాచితిమి = కాపాడితిమి. కోమరుగన్=బాగుగా; దీనిన్; చేకొనుము=గ్రహింపుము. కోమలి=ఈదమయంతి; నీకున్=నీయందు; అనురక్త=ప్రేమగలది; నావుడున్ = అని చెప్పఁగా (పై. ప. అ.)

216. మరుద్వచన అనంతరమునన్=వాయుదేవునిమాటలుపూర్తిఅయిన తర్వాత; సురపుష్పవృష్టి=దేవతలు గురిపించిన పుష్పవర్షము, కురిసెన్; సురదుందుభినాదములు=వేల్పులభేరీవాద్యముల మ్రోఁతలు; మ్రోసెన్=మ్రోఁగెను. గంధవాహుండును=వాయువును; కరము=మిక్కిలి; ప్రశస్తముగన్ = తిన్నగా; వీచెన్=విసరెను.

217. ఇట్లు ఎల్లవారికిన్; ఆశ్చర్యంబుగాన్=సంతోషముగలుగునట్లు; వాయుదేవుఁడు; తన్ను ఎఱింగించి=తానెవ్వఁడైనది తెల్పి; దమయంతీ పతివ్రతాగుణంబులును=దమయంతీదేవియొక్క పాతివ్రత్యమహిమమును; పతియందలి = భర్తయందలి; అకృత్రిమఅనురాగంబును = కపటముగాని ప్రీతిని; చెప్పినన్ = తెలుపఁగా; విని; నలుండు; పరమ ప్రమోద పరిపూర్ణ హృదయుండు ఐ-పరమ=ఎక్కువ; ప్రమోద=సంతోషముచేత; పరిపూర్ణ=నిండిన; హృదయుండై=మనస్సుగలవాఁడయి; తత్ క్షణంబు అ = వెంటనే; కర్కోటకున్; తలంచి; వాఁడిచ్చిన పుట్టంబు = ఆ కర్కోటకుఁ డొసఁగిన వస్త్రంబును; పైన్=మీఁద; పెట్టికొని=ఉంచుకొని; నిజరూపంబున్=తన స్వరూపంబును; తాల్చినన్=ధరింపఁగా.

218. ఆయత బాహుఁడు=నిడుపుచేతులుగలవానిని; తప్తకనక అంచిత వర్ణుఁడు - తప్తకనక=అపరంజివంటి; అంచిత=ఒప్పిన; వర్ణుఁడు = శరీరచ్ఛాయ గలవానిని; మనోజరూపుఁడు = మన్మథుని రూపంబుగలవానిని; ఇంద్రునివలె నాచరించువానిని=ఇంద్రునివలె నుండువానిని; సూర్యతేజుఁడు=సూర్యునివంటి ప్రకాశముగలవానిని; నిషధప్రభుఁడు=నిషధదేశపురాజును; అనలుఁడు=అనలమహారాజును; చూచి; పద్మ...నేత్ర-పద్మపత్ర=తామరపువ్వురేకువలె, ఆయత=నిడివిదైన; నేత్ర=కన్నులుగలదయిన, దమయంతి; కరంబు=మిక్కిలి; ముదంబుఁ=సంతోషమును; ఒంది=పొంది; బంధులకుఁ=చుట్టాలకును; మిత్రులకుఁ=చెలులకును; హృదయప్రియంబుగఁ=మనస్సున కింపుగలుగునట్లుగా; లక్ష్మీయుత=కాంతితోఁగూడినది; అయ్యెఁ.

219. ఇట్లు; సంగతులు=కూడినవారు; ఐన; ఆయిరువురకుఁ = అనల దమయంతులకు; విరహపరితాపంబుతోఁ అ=ఎడఁబాటువలని సంతాపంబుతోఁగూడ; శరీరమలినత్వంబు=దేహములోని మురికి; వాసెను=తొలఁగెను. (విరహతాపంబడంగెను. దేహమున మురికియుఁబోయెను.) పరస్పరానురాగంబుతోఁ అ=ఒండొరులమీఁది చెలిమితోఁగూడ; విభూషణవిశేషములు=గొప్ప సొమ్ములు;విలసిల్లెఁ=ప్రకాశించెను. ఒండొరులమీఁదఁ బ్రేమగలిగెను. (వారు దాల్చిన భూషణములును ప్రకాశించెను.) అంతఁ=పిమ్మట; అంతయుఁ = సవిస్తరముగా; విని; భీముఁడు; జాతసస్య = పైరులుగలది; ఐన; వసుధ = భూమి; తోయసంప్రాప్తిఁ=నీళ్ళుపోయుటచేత; ఆప్యాయిత ఐనట్లు=తృప్తి నొందినట్లు; అజ్ఞాత చర్యండు = పోవిడి తెలియకయుండినవాఁడు; అయిన పతిఁ; పడసి=పొంది; పరమసంతుష్టహృదయ ఐ = ఎక్కువ సంతసముతోఁ గూడిన మనస్సుగలదై; చంద్రునితోఁ; కూడిన; రాత్రియుఁ పోలెఁ = రాత్రివలె; ఒప్పుచున్న = ప్రకాశించు; దమయంతిఁ; చూచి; సంతసిల్లి; తనపురంబునందుఁ; అష్ట శోభనంబులు = ఎనిమిదివిధంబులైన అలంకారములను, దేవగృహంబులందుఁ = దేవాలయములందు, విశేషపూజలు = ఎక్కువపూజలు; చేయించెను. అట్టి మహోత్సవంబు = అట్టి గొప్ప వేడుక

జరుగుట; ఎఱింగి=చూచి; ఋతుపర్ణుండు; నలునొద్దకున్; వచ్చి; నీవు; అఖిలలోకపూజ్యుండవు=జనులందరిచేఁ గొనియాడఁబడినవాఁడవు; అయ్యున్ = అయినప్పటికిని, నాయొద్దన్; బాహుకుండు అనన్ = బాహుకుఁడని, ప్రచ్ఛన్నవృత్తిన్ = గోప్యమైనరూపముతో; ఉన్న, నిన్నున్, ఎఱుంగక; నీచకర్మలయందున్=వంటచేయుట మొదలగు హీనపుఁబనులయందు; నియోగించితిని=ఉంచితిని; దీనిన్=ఈప్రకారముచేయుటను; క్షమియింపుము=ఓర్చుకొనుము. అని; నలుచేతన్; సత్కృతుండు ఐ=మన్ననచేయబడినవాఁడై; అశ్వహృదయంబు అనుపేరుగల విద్యను; ఉపదేశంబుగొని = తెలిసికొని; అయోధ్యకున్, చనియెన్; అటన్=అచ్చట; నలుండును, విదర్భాపురంబునన్, ఒక్కమాసంబు; నివాసంబుచేసి = ఉండి, విదర్భేశ్వరున్=భీమరాజును; వీడ్కొని; దమయంతిన్; అందున్ అ=అచ్చటనె, ఉనిచి; ఒక్కరథంబును; పదునాఱు ఏనుఁగులును, ఏఁబదిగుఱ్ఱములును, ఆఱునూఱుకాల్బలంబులును; తనకున్; తోడు=సాయముగా; కాన్=కాఁగా; నిషధపురంబునకున్, అరిగి, పుష్కరున్, కని; ఇట్లు, అనియెన్.

220. అమరఁగన్ = ఒప్పిదముగా, నీకున్; జూదము, అభిమతమేనిన్=ఇష్టమైనయెడల, దమయంతి, ఒడ్డయిగాన్ = పందెముగా; నీతోన్; జూదముఆడన్; కడంగెదను = పూనెదను. ధరణీరాజ్యము = నిషధదేశమును, నీవు; నాకు, ఒడ్డు = పందెముగా; ఇడుము= పెట్టుము. (నేను దమయంతిని పందెముగాఁ బెట్టెదను. నీవు రాజ్యము పందెముగాఁ బెట్టుము. ఇట్లు పందెముగాఁ బెట్టుకొని జూదమాడుదము రమ్మని నలుఁడు పుష్కరునిఁబిలిచెను.)

221. రాజ్యము; వీరభోజ్యముసుమ్ము= అనుభవింపఁదగినదేకదా; వింటె=నీవును వినియున్నావుగదా. నీవును; నేనును; దుర్వారవృత్తిరథంబులు - దుర్వార=నిలువరాని; వృత్తి=ప్రవేశముగల; రథంబులు = తేరులు, ఎక్కి; అవంధ్యవిక్రమము = తగనిపరాక్రమము; ఏర్పడన్ = వెల్లడియగునట్లు; భూరివీరరణంబు=గొప్పశూరులుచేయుయుద్ధంబును; ఒనర్తము = చేయుదము; ఘోరన్=యుద్ధమునందు; ఓర్చినవాఁడే=గెల్చినవాఁడే; వీరగుణఉన్నతిన్ =

శౌర్యముచేగలిగినఖ్యాతిచేత; ఈధారుణీతలరాజ్యసంపదల౯ = ఈభూమండలమున కధిపతియగుటయను ఐశ్వర్యమును; తాల్చును = పొందునుగాక.

222. ఈరెంటిలో=జూదము పోరులలో; నిరు౯; ఎయ్యది; ఇష్టంబు; దానికి౯, కడంగుము=పూనుము. అనిన౯; పుష్కరుండు, రణంబున౯,పరాజితుండను; అగుదును = ఓడిపోదును. నలు౯; తొల్లియు౯=మునుపు; జూదంబున౯, ఓడించినవాఁడ౯=ఓడఁగొట్టినవాఁడ; కావున౯; ఇంకను = మఱియు; ఓడించి; దమయంతి౯; చేకొని=పొంది; కృతార్థుఁడనగుదును = కోరిక నొందెదను. అని, సంతసించి; ఏను; ఓటుపడితిని ఏని=ఓడిపోతినేని; నిఖిలమహీరాజ్యంబు = భూమండల ప్రభుత్వమంతయు; నియది అ = నిదె; నీవు; ఓటుపడితివి ఏని=ఓడినయెడల; దమయంతి; నాయది=నాది; అనిపలికి; ఒడ్డి = పందెముగాపెట్టి; నలుతో౯; జూదమాడి; ఓటుపడిన౯ = ఓడిపోవఁగా; (పై. ప. అ.)

223. ఘనముగ౯=గొప్పఁగా; జంబూద్వీపంబు౯; కలవారు ఎల్ల౯=ఉన్న జనులందఱు; ఎఱుఁగ౯ = తెలిసికొనునట్లు, పునర్ద్యూతమున౯ = తిరిగి జూదమున; పుష్కరుచేత౯ = పుష్కరునివలన; అనఘుఁడు = పాపములేని నలుఁడు; అత్యున్నతితోడ౯ = ఎక్కువగారవముతో; అఖిలరాజ్యము=రాజ్యమునంతయు; కొనియె౯ = లాగికొనెను.

224. ఇట్లు; జూదంబున౯; పుష్కరు౯; ఒడిచి=ఓడించి; సకలమహీరాజ్యంబును = భూప్రభుత్వమునంతయు చేకొని = గైకొని; నలుండు, వానికి౯; ఇట్లనియె.

225. కలిసంప్రాప్తుఁడవై=కలిపురుషునిచే నాక్రమింపఁబడినవాఁడవై; కడు౯ = మిక్కిలి; బలముఅఱి = శక్తియుడిగి;నిచేత౯; తొల్లి = పూర్వము బలవద్ద్యూతఆకులచిత్తుండును; బలవత్=బలవంతముగా;ద్యూత = జూదముచేత, ఆకుల=చెదిరిన; చిత్తుఁడను = మనస్సుగలవాఁడను; ఐతిని; అది = అట్లగుట; నీబలము = నీశక్తి; అని; బలవంతుఁడవు ఐ = మొనగాఁడవై; గర్వింప౯ = మదించుట; చనునే = తగునా? (తగదని భావము.)

226. నీవు; నాపితృవ్యపుత్రుండవు = నా పినతండ్రి కుమారుండవు; ఎద్దియుఁ=ఏమియు, చేయనోపను = చేయజాలను, పొమ్ము; అని; పుష్కరుఁ; విడిచిపుచ్చి=వదలిపెట్టి; పుష్కలంబు=పండినది; ఐనరాజ్యంబుతోఁ; నలుండు; ఉన్నంతఁ=ఉండఁగా.

227. భీమప్రస్థాపిత ఐ = భీమునిచేఁ బయనముచేసి పంపఁబడినదై; కోమలి=తిన్ననిదియగు; తామరసదళాక్షి=పద్మనేత్రయగు దమయంతి; పుత్రకులును=బిడ్డలును; తానును; లక్ష్మీమహిమ=సంపదయొక్క యతిశయము; వెలుఁగుచుండఁ=ప్రకాశింపఁగా; తనపతికడకుఁ=తనభర్తయొద్దకు వచ్చెను.

228. అట్లు (వచ్చిన), తనహృదయేశ్వరి=తన ప్రాణనాయకి; ఐన దమయంతిఁ; కూడి=చేరి, నలుండు; విధి...ఖుండు ఐ - విధి = శాస్త్రప్రకారము, విహిత=చేయఁబడిన; అనేక=పెక్కు; శతమఖుండుఐ=నూఱుయాగములు గలవాఁడయి (శాస్త్రమందుజెప్పినరీతినూఱుయాగములుచేసినవాఁడై), శతమఖువిలాసంబుతోఁ=దేవేంద్రునివంటియొయ్యారముతో, సకలరత్నయుతంబు=అన్నిరత్నములతోఁగూడినది, ఐన; రత్నగర్భాదిరాజ్యంబు; భూపరిపాలనంబును; చేసెఁ=ఒనరించెను. కావునఁ; అక్షజితుండవు అయితివి = జూదమున నోడితివి; అని; వగవక యుండుము=చింతింపకుండుము. నీవును; దైవమానుషసంపన్నుండవు ఐ=దేవానుగ్రహము పురుషప్రయత్నములతోఁ గూడినవాఁడవై; శత్రువులఁ; జయించి; సకలమహీరాజ్యంబు = భూమికంతయుఁ ప్రభుత్వమును; పడయుదువు. అని; బృహదశ్వుండు; ధర్మరాజునకుఁ; అక్షహృదయంబు- అను పేరుగల విద్యను; ఉపదేశించి=చెప్పి.

229. జగత్ ఈశా=ఓపుడమిఱేఁడా; ఈనలోపాఖ్యానము=ఈనల చరిత్రము; ఎప్పుడు; దత్తావధానులు ఐ = గమనముంచినవారై; వినువారుఁ; తవిలి=శ్రద్ధయుంచి; భక్తిఁ=భక్తితో; చదివెడువారును;కలిదోషనిర్ముక్తులు=కలిపురుషునిదోషములచే విడువఁబడినవారు; అగుదురు. నిఖిలపుణ్యభాగులు అగుదురు=అన్ని పుణ్యములను పొందినవారయ్యెదరు. బహు...యుక్తులు -

బహు=హెచ్చిన, పుత్ర=కొడుకులు కూఁతులు; పౌత్ర=మనుమలు మనుమరాండ్రు; ఆయుః=దీర్ఘాయువు; ఆరోగ్య=సౌఖ్యము, వీనితో; యుక్తులు = కూడినవారు అగుదురు. ఎల్లవిషయంబులుఁ; దుష్టవిషయంబులకును = చెడ్డ సంగతులకును; దూరులు = చేరనివారు, అగుదురు. ధర్మఆత్ములు=మంచిపనులందు ఆసక్తిగలవారు; అగుదురు. అధిప = ఓధర్మరాజా; ఉర్విఁ = భూమియందు; ఇదియుఁ = ఈనలచరిత్రమును; కడుఁ = మిక్కిలి; ప్రసిద్ధము. కర్కోటకునిఁ; దమయంతిఁ, పుణ్యమూర్తి=పావనరూపముగల; నలునిఁ నుతచరిత్రుఁడు ఐన=మంచిప్రవర్తనముగల; ఋతుపర్ణుఁ, కీర్తింపఁ=కొనియాడుటచేత; కలిభయంబులు ఎల్లఁ = కలిపురుషునివలని భయంబు లన్నియు; తొలఁగుఁ=నశించును.

నలోపాఖ్యాన టీక

సమాప్తము.

తెనాలి: "త్రిపురసుందరీ" ప్రెస్సున ముద్రితము—1927.